# మూకపంచశతి

## స్తుతి శతకమ్

మూలం

మూకమహాకవి

శ్రీ స్వామి మధు సూదన సరస్వతిగారి

అనుజ్ఞతో

ప్రతిపదార్థము

శ్రీ వి.ఏ.కుమారస్వామి
ప్రిన్సిపాల్
కేంద్రీయ విద్యాలయం, హైదరాబాదు - 5

ప్రకాశకులు

సాధన గ్రంథమండలి, తెనాలి

 (వెల: రూ 10/-లు)

సర్వస్వామ్యములు.

1) సాధన గ్రంథమండలి, తెనాలి

2) రావికృష్ణ కుమారి

H.No. : 4-103

I.L.T.D. Colony (Extn)

Kothapeta,

CHIRALA – 523 157.

Phone : (08594) 34054

వట్టి చెరుకూరు వాస్తవ్యులైన శ్రీ రావి వెంకట సుబ్బయ్య, సీతారావమ్మగార్ల ఆర్థిక సహాయంతో ముద్రింప బడిన ఈ పుస్తకం కుర్తాళం - శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతి - శ్రీ శివచిదానంద భారతీస్వామివారి పాదపద్మములకు సమర్పితము.

ప్రతులు : 1000

యువసంవత్సరం

కార్తీక పూర్ణిమ, 7-11-1995

ముద్రణ:

శ్రీ లక్ష్మి ప్రెస్, బాపట్ల.

Phone: 4060, 4356

# మండలి మాట

పూజాకోటి సమం స్తోత్రం స్తోత్రకోటి సమం జపః
జపకోటి సమం ధ్యానం - ధ్యాన కోటి సమం లయః

'కోటి పూజలు ఒక స్తుతి సమానము. కోటి స్తుతులు - జపము,
కోటి జపములు - ధ్యానము, కోటి ధ్యానములు - లయము సమములు'

అని ఆర్యోక్తి, అనగా 'పూజా-స్తుతి-జప-ధ్యాన-లయములు' పరస్పరము ఒకదానికంటే ఒకటి మిన్న' అని భావము. ఎందుచే అలా అన్నారు? పైగా వీనిలో చాల సామాన్యమైనదిగా తేల్చబడిన పూజకే లోకమునందు ఆదరము ఎక్కువగా కనబడుచున్నది. పూజకు సామాన్యమో అధికమో గొప్పదనమున్నది కదా! ఆ గొప్పదనము దానికి ఎలా వచ్చినది? అసలు గొప్పదనానికి 'గీటురాయి' ఏమిటి?కొంచెం పరిశీలిద్దాం! 'యోగః చిత్తవృత్తినిరోధః' అని పతంజలి చెప్పిన మాట. 'చిత్తము యొక్క వ్యాపారాన్ని సాగనీయకుండుట యోగము'. అని ఆయన అన్నారు.సర్వదా కదులుతూ ఉండుటయే మనసు యొక్క లక్షణము. అదే దాని వ్యాపారము. ఆ కదలికను, ఆ వ్యాపారమును సాగనీయకుండుట యోగము. అనగా మనసును నిశ్చలం చేయాలి అని పతంజలి యొక్క ఉపదేశం. వారు ఎందులకు ఇట్లు ఉపదేశించినారు? చిత్త నైశ్చల్యం సాధింపబడితే - పరమాత్మ అనుభవానికి అడ్డమన్నది ఉండదు. అంతయును సాధింపబడినట్లే, బ్రహ్మాత్మైక్యం కరతలామలకమైనట్లే! అందుచే మనసు యొక్క వ్యాపారాన్ని ఏమాత్రం నిలువరించే పని అయినా గొప్పది అవుతుంది. ఒక క్రియ మనోవ్యాపార నియమనమునకు ఎంతగా తోడ్పడుతోంది? అనేదే దాని గొప్పదనాన్ని నిర్ణయించుటకు గీటురాయి. అయితే పూజాదికమున మనోవ్యాపారం నిరుద్ధం అవుతోందన్న మాట! దేనియందెంత వరకు ఈ నిరోధం ఏర్పడుతోందో పరిశీలిద్దాం!

పూజలో మానసిక వ్యాపారం నిలిచిపోయినదా? లేదే! గంధం - పుష్పం - ధూపం - దీపం - నైవేద్యం. ఇవన్నీ ఉండాలి కదా! ఇవన్నీ సమకూర్చుకొనడం - యథోక్త మంత్రముతో వీనిని స్వామికి సభక్తికము సమర్పించడం మనసుయొక్క వ్యాపారం నిలిచిపోయినపుడు ఎలా సాధ్యం అవుతుంది? కాగా పూజయందు మనసు యొక్క వ్యాపారం నిలిచి పోలేదు సరికదా, దాని వ్యాపారానికి చాలా 'దర్వాజాలు' ఎత్తినట్లు అవుతోంది. సామాన్యమైన అంగడిని 'సూపర్ బజారు'గా మార్చినట్లు అవుతోంది. కాని ఇచట ఒక చిత్రం ఉన్నది. మనసుకు చలనం ఎంత ఉన్నా- అది 'భగవంతుడు, స్వామి' అనే కేంద్రాన్ని విడిచి దూరంగా వెళ్ళడానికి వీలుకాదు. గంధం తీయమన్నాడు. ఎవరికొరకు? స్వామి కొరకు. పూవులు ఏరుచున్నాడు. ఎవరి కొరకు? స్వామికొరకు.

ఇలాగే ధూపం - స్వామికి. దీపం - స్వామికి, నివేదన - స్వామికి. ఇలా పూజలోని సర్వకృత్యాలకు స్వామియే కేంద్రం అవుతున్నాడు. అందుచే అనగా - 'స్వేచ్ఛగా గంతులు వేయడానికి వీలుకాకుండా 'స్వామి అనే బంధాన్ని' మనసుకు తగిలించడం జరుగుతోంది గనుక' - పూజ అనేది గొప్పది అయినది.

పూజలో కంటె స్తోత్రంలో ఈ బంధం మరింత బిగుసుకొంటోంది. అనగా - స్వామి యొక్క రూప-కళా-వైభవం-మహిమాదుల సంస్కృతి రూపమై స్తుతియందు చిత్త వ్యాపారాన్ని మరింత కుదించడం జరుగుతోంది. ఇలా పూజలో కంటె స్తుతియందు చిత్తవృత్తినిరోధం అధికం కనుక 'పూజాకోటి సమం స్తోత్రం' అన్నారు.

ఇట్లే జపం - ధ్యానం - లయం (ధ్యేయవస్తువు నందు చిత్తం స్వత్వాన్ని కోల్పోవటం) ఒకదానికంటే వేరొకదాని యందు చిత్తవృత్తినిరోధం అధిక మైనందున (లయం సిద్ధావస్థయే) అవి ఒకదానికంటె ఒకటి మహిమాన్వితములుగా చెప్పబడినవి.

మరి, పూజయందే లోకానికి ఆదరాధిక్యం ఎలా కలిగినది? అంటే - లోకం స్థూలదృష్టితో ఉంటుంది, స్థూల విషయమందే అది రమిస్తుంది, అందుచే అలా జరుగుచున్నది. అనేది ఇంచుక పరిశీలిస్తే తెలిసి వచ్చేవిషయమే! ఇదంతా దేనికి? అనేది ఒక ప్రశ్నకాగా- పరస్పరానురాగ బద్ధులైన యువతీ యువకులు తమ ప్రప్రథమ సమాగమమంలో (శారీరకం) తమ్ము దాము మరిచిపోవడం జరుగుతోంది: అచట చిత్తవృత్తి మనస్సు యొక్క వ్యాపారం ఇంచుమించు పూర్తిగా నిలిచిపోతోంది కదా!

తన్మయః కిమహం బాలా మన్మయా కిముభావపి
కిమానంద మయా వేతి నవిజ్ఞాతం తదా మయా।

'నేను ఆమెయందే లీనుడనైతినో - ఆమెయే నాయందు లీన యైనదో - లేక మేమిరువురమును ఆనందమున లీనుల మైనామో - నా ఎరుకకు అందుటలేదు.

వంటివి ఉన్నాయి కదా! కాంతా ప్రథమ సమాగమ వేళ చిత్తవృత్తులు నిలిచి పోవుచున్నవి కదా! మనసు యొక్క వ్యాపారానికి గట్టి అవరోధం కల్పించే కార్యానికే 'పెద్దపీట' వేయాలి, అను కొంటే ఆ పీట దీనికే వేయాలి కదా! అని కూడ ఎవరైనా ఆలోచనా పరులు శంకింప వచ్చును. అయ్యా! ఇది నిజమే! నిస్సందిగ్ధంగా అది సమాధ్యవస్థయే. కాని అది క్షణికము. పైగా అది ప్రథమ సమాగమముననే సంభవిస్తుంది. అనంతరసమాగమములలో చిత్తం కొంచెం కొంచెంగా జాగ్రుతం అవుతూ క్రమంగా పరిపూర్ణంగా జాగృతం అవుతుందే - చిత్తం దివాళా తీయదు. ఈ విషయం -

'త్రిపురారహస్యం' వంటి గ్రంథాలు వివరించి ఉన్నాయి. సమాధ్యవస్థా స్వరూపాన్ని ఇంచుక అవగతం చేసి కొనడానికి అది ఉపయోగ పడుతున్నది కాని - సాధనకు పనికిరాదే - అనేది నిష్కర్ష! అస్తు!

ఇది మహనీయులైన శ్రీశ్రీశ్రీ మూకశంకరులవారు (మూక కవీంద్రులు) రచించిన మూక పంచశతి లోని స్తుతి శతకము. ప్రకృతిచే మూగవారై - పరమేశ్వరీ ప్రసాదముచే వచో విభవసంపన్నులైన వీరి వాగ్గుంఫనములు - వియన్నదీతరంగములు! అవి శివుని జడను నడుమ నుండి- పుడమిపై నడుగిడి పరుగిడిన పావన గంగా ప్రవాహములు. 'అంబికా చరణసరోజ సుగంధ బంధురములైన వీని యందు తన్ను దామరచి నిశ్శేషము నిమగ్నతను గాంచిన భాగ్యశాలి మరల జననీ గర్భమునందు అడుగిడడు' - అనుట స్వభావోక్తియే కాని అత్యుక్తి కాదు. అట్లు నిమగ్నుడగుటకు వీని అర్థతాత్పర్యములు సవివరము లెస్సగా విశదము కావలెను. అపుడు మాత్రమే నిమగ్నత సంభవము.

సాధక పాఠకునకు వీని యందు నిమగ్నతను సమకూర్చి పెట్టు అర్థతాత్పర్య వివృతులను విరచించుటకు మంచి పాండిత్యముతో బాటు ఆత్మాభిముఖమైన చిత్తవృత్తి కలవారు కావలెను. సంస్కృత పండితులు పలుచబడి పోయిన ఈ కాలములో అట్టివారిని వెదకి - వెంటాడి ఒకొక్కరిచే ఒకొక్క శతకముగా ఇంతవరకు - పాదారవింద శతకము (అర్థవివృతులు : శ్రీలోకాచార్యులు), కటాక్షశతకము (అర్థ తాత్పర్య వివృతులు: శ్రీ దోర్బల విశ్వనాథ శర్మగారు) అనెడి రెండు శతకములను అచ్చొత్తించి, వెలికి దెచ్చి-

-ఇపుడీ స్తుతి శతకమును ఇట్లు ప్రతి పదార్థ సంయుతముగా వెలువరించుచు- మిగిలిన రెండు శతకములను యథా శీఘ్రము వెలుగులోనికి దీసికొని రావలె నన్న పూనికతో తదేకలక్ష్యముగా సాగుచున్న శ్రీకామాక్షీ దేవీ శ్రీచరణ సరోజ మధుపములైన - శ్రీ మోహనరావుగారిని ఎంత అభినందించినను దక్కువయే!

అనల్ప విద్యాప్రాభవ సంపన్నులై- కోరినంతనే ఈ స్తుతి శతకమునకు, ఇట్లు అర్థవివృతిని అనుగ్రహించిన శ్రీ. వి.ఏ. కుమారస్వామిగారు, వారిని నేను బ్రస్తుతించుచు- ప్రాంజలినై 'అమ్మా! ఇయ్యిరువురి హృదయ పీఠములయందును సంతతము వసించుచు- వీరలకు అమందానంద సంధాత్రివై విరాజిల్లుము' అని అంబికను ఆ కామాక్షీ మహాదేవిని బ్రార్థించుచున్నాను.

ఇట్లు,

యువ-కార్తిక పూర్ణిమ
తెనాలి

**బులుసు సూర్య ప్రకాశ శాస్త్రి**
వ్యవస్థాపకుడు : సాధన గ్రంథ మండలి.

# స్తుతి శతకమ్

1. పాండిత్యం పరమేశ్వరి స్తుతివిధౌ నైవా(శ్రయంతే గిరామ్
వైరించాన్యపి గుంఫనాని విగలద్గర్వాణి శర్వాణి తే।
స్తోతుం త్వాం పరిఫుల్ల నీలనలిన శ్యామాక్షి కామాక్షి మామ్
వాచాలీకురుతే తథాపి నితరాం త్వత్పాదసేవాదరః॥

అ॥ హే పరమేశ్వరి - ఓ పరమేశ్వరి!, శర్వాణి - శర్వుని (శివుని) పత్నీ!, పరిఫుల్ల - బాగుగా వికసించిన, నీల - నీలమయిన, నలిన - కలువపూవులవలె, శ్యామాక్షి - నల్లని కనులు గలదానా, కామాక్షి - ఓ కామాక్షీ!, తే - నీ యొక్క, స్తుతివిధౌ - స్తోత్రముచేయు పద్ధతిలో, వైరించాని - బ్రహ్మకు సంబంధించిన, గుంఫనాన్యపి - వాక్కుల సమూహములు కూడ (వేదములుకూడ), విగలద్గర్వాణి - గర్వమును వీడినవియై, గిరాం పాండిత్యమ్ - వాక్కుల ప్రావీణ్యమును, న ఆశ్రయంతే ఏవ - అండగా తీసికొనుటయే లేదు, తథాపి - అయినప్పటికి, త్వత్పాదసేవాదరః - నీ పాదములసేవించుటయందాసక్తి, మాం - నన్ను, నితరాం - మీదు మిక్కిలి, వాచాలీకురుతే - వాగుడుకాయను చేయుచున్నది.

2. తాపింఛ స్తబకత్విషే తనుభృతాం దారిద్ర్యముద్రాద్విషే
సంసారాఖ్యతమోముషే పురరిపో ర్వామాంకసీమాజుషే।
కంపాతీర ముపేయుషే కవయతాం జిహ్వాకుటీం జగ్ముషే
విశ్వత్రాణపుషే నమో2స్తు సతతం తస్మై పరంజ్యోతిషే॥

అ॥ తాపింఛస్తబకత్విషే - చీకటిమ్రాని పూగుత్తుల తళుకుగలినట్టియు, తనుభృతాం - జీవుల యొక్క, దారిద్ర్యముద్రాద్విషే - దారిద్ర్యముద్ర నెదిరించునట్టియు, సంసారాఖ్య తమోముషే - సంసారమను చీకటిని హరించునట్టియు, పురరిపోః - శివుని యొక్క, వామాంకసీమాజుషే - ఎడమతొడపై నున్నట్టియు, కంపాతీర ముపేయుషే - కంపానదీ తీరమున విహరించునట్టియు, కవయతాం - కవులయొక్క, జిహ్వాకుటీం - నాల్కయను గృహమును, జగ్ముషే - పొందినట్టియు, విశ్వత్రాణ పుషే - లోక రక్షణమును పెంపొందించు నట్టిదియు నైన, తస్మై పరంజ్యోతిషే - ఆ పరంజ్యోతికి, సతతమ్ - ఎల్లపుడు, నమో2స్తు - నమస్కారము అగుగాక.

3. యే సంధ్యారుణయన్తి శంకర జటాకాంతార చంద్రార్భకమ్
సిందూరన్తి చ యే పురందరవధూ సీమంత సీమాంతరే।
పుణ్యం యే పరిపక్వయన్తి భజతాం కాంచీపురే మా మమీ
పాయాసుః పరమేశ్వరప్రణయినీ పాదోద్భవాః పాంసవః॥

అ॥ యే - ఎవ్వి, శంకరజటాకాంతారచంద్రార్భకమ్ - శంకరునిజడలనెడి యడవిలోని బాల చంద్రుని, సంధ్యారుణయన్తి - సంధ్యాకాలమందలి ఎఱుపు పులుముకొనినట్లు, యే - ఏవి, పురందరవధూ సీమంత సీమాంతరే - శచీదేవి పాపటను, సిందూరన్తి చ - సిందూరముతో సింగారించునట్లు చేయునో, యే - ఏయవి, కాంచీపురే - కాంచీపత్తనమందు, భజతామ్ - సేవించు భక్తుల యొక్క, పుణ్యం పరిపక్వయన్తి - పుణ్యములను పండించునో, అమీ - అట్టి, పరమేశ్వర ప్రణయినీ - శివుని ప్రియురాలి, పాదోద్భవః - పాదములందున్న, పాంసవః - ధూళికణములు, మామ్ - నన్ను, పాయాసుః - కాపాడుగాక!.

4. కామాడంబరపూరయా శశిరుచా కమ్రస్మితానాం త్విషా
కామారే రనురాగసిన్ధు మధికం కల్లోలితం తన్వతీ।
కామాక్షీతి సమస్త సజ్జననుతా కల్యాణదాత్రీ నృణామ్
కారుణ్యాకులమానసా భగవతీ కమ్పాతటే జృమ్భతే॥

అ॥ కామాడంబరపూరయా - కాముని ఆడంబరమును నిండించుచు, శశిరుచా - చంద్రుని కాంతి కలిగిన, కమ్రస్మితానాం త్విషా - చక్కని చిరునవ్వుల కాంతితో, కామారేః - మన్మథుని శత్రువయిన శివుని యొక్క, అనురాగసిన్ధుమ్ - అనురాగ సాగరమును, అధికమ్ - ఎక్కువగా, కల్లోలితం తన్వతీ - ఉప్పొంగునట్లు చేయుచున్నట్టియు, సమస్త సజ్జననుతా - సకల సాధువులచే కొనియాడబడినట్టియు, నృణాం కల్యాణదాత్రీ - మానవులకు శుభములనిచ్చునట్టియు, కారుణ్యాకులమానసా - దయతో వ్యాకులమైన మనస్సుగల, కామాక్షీతి - కామాక్షి యను పేరుగల, భగవతీ - పరదేవత, కమ్పాతటే జృమ్భతే - కంపానదీ తీరమున విలసిల్లుచున్నది.

5. కామాక్షీణపరాక్రమ ప్రకటనం సంభావయన్తీ దృశా
శ్యామా క్షీరసహోదర స్మితరుచి ప్రక్షాళితాశాంతరా।
వామాక్షీజన మౌళిభూషణమణిః వాచాం పరా దేవతా
కామాక్షీతి విభాతి కాపి కరుణా కంపాతటిన్యా స్తటే॥

అ॥ శ్యామా - యౌవన మధ్యస్థయైనట్టియు, దృశా - చూపుచేత, కామ - మన్మథుని, అక్షీణ పరాక్రమ - అధికపరాక్రమము యొక్క, ప్రకటనమ్ - ప్రకాశమును, సంభావయన్తీ - గౌరవించుచున్నట్టియు, క్షీరసహోదర - పాలతో సమానమయిన, స్మితరుచి - చిరునగవు కాంతితో, ప్రక్షాళిత - కడుగబడి నిర్మలములయిన, ఆశాంతరా - దిక్కుల మధ్య భాగము గల్గినట్టియు, వామాక్షీ జన - స్త్రీల యొక్క, మౌళిభూషణ మణిః - శిరోలంకారమణి యైనట్టియు, వాచాం పరాదేవతా - వాక్కులకు సర్వాధికారిణియైన, కామాక్షీతి - కామాక్షియని ప్రసిద్ధి గలిగిన, కాపి కరుణా - ఒకానొక దయారసమూర్తి, కంపాతటిన్యాః - కంపానది యొక్క, తటే - తీరమునందు, విభాతి - శోభిల్లుచున్నది.

6. శ్యామా కాచన చంద్రికా త్రిభువనే పుణ్యాత్మనా మాననే
సీమాశూన్య కవిత్వవర్ష జననీ యా కా2పి కాదమ్బినీ।
మారారాతి మనో విమోహనవిధౌ కాచి త్తమఃకందళీ
కామాక్ష్యాః కరుణాకటాక్షలహరీ కామాయ మే కల్పతామ్॥

అ॥ శ్యామా - చామనచాయ గల (యౌవనమధ్యస్థయని అర్థాంతరము), కాచన చంద్రికా - ఒకానొక వెన్నెల (వెన్నెలవలె ఆహ్లాదకారిణియైన), త్రిభువనే - ముల్లోకముల యందు, పుణ్యాత్మనామ్ - పుణ్యపురుషుల యొక్క, ఆననే - ముఖమందు (నోటి నుండి), సీమాశూన్య - అంతములేని, కవిత్వవర్ష జననీ - కవితావర్షము కురిపించు, యా కాపి కాదమ్బినీ - ఒకానొక మేఘమాల యైనట్టియు, మారారాతి - మన్మథుని శత్రువగు శివుని యొక్క, మనోవిమోహన విధౌ - మనస్సును వ్యామోహపఱచుటలో, కాచిత్ - ఒకానొక, తమఃకందళీ - మొలక చీకటియునైన, కామాక్ష్యాః - కామాక్షి యొక్క, కరుణాకటాక్షలహరీ - కరుణాకటాక్షమను తరంగము, మే - నా యొక్క, కామాయ - కోరిక కొఱకు, కల్పతామ్ - సమర్థమగుగాక!

7. ప్రౌఢధ్వాంతకదంబకే కుముదినీపుణ్యాంకురం దర్శయన్
జ్యోత్స్నాసంగమనేఽపి కోక మిథునం మిశ్రం సముద్భావయన్।
కాలిందీలహరీదశాం ప్రకటయన్ కమ్రాం నభ స్యద్భుతామ్
కశ్చిన్నేత్రమహోత్సవో విజయతే కాంచీపురే శూలినః॥

అ॥ ప్రౌఢధ్వాంత కదంబకే - ముదిరిన చీకటి గుంపునందు (నల్లని కేశపాశమునందు), కుముదినీ పుణ్యాంకురమ్ - కలువతీగల పుణ్యపుమొలకను (చంద్రకళను), దర్శయన్ - చూపుచు, జ్యోత్స్నా సంగమనేఽపి - వెన్నెలతో కలసియున్నను (చిఱునవ్వుతో కూడినను) కోకమిథునమ్ - చక్రవాక పక్షుల జంటను (స్తనయుగము), మిశ్రం సముద్భావయన్ - కలసినదానిగా ప్రకటించుచు, నభసి - ఆకాశమందు (నడుమునందు), కమ్రాం - అందమయిన, కాళిందీలహరీదశాం - యమునా తరంగ స్థితిని (నూగారును), ప్రకటయన్ - చూపించుచు, శూలినః - శివుని యొక్క, కశ్చిత్ - ఒకానొక (మాటలకందని), నేత్రమహోత్సవః - కనులపండువు (కామాక్షీదేవి), కాంచీపురే - కాంచీపట్టణమందు, విజయతే - సర్వోత్కర్షతో విరాజిల్లుచున్నది.

8. తన్ద్రాహీన తమాలనీల సుషమైః తారుణ్య లీలాగృహైః
తారానాథకిశోర లాంఛితకచైః తామ్రారవిన్దేక్షణైః।
మాత స్సత్క్రియతాం మనో మనసిజప్రాగల్భ్య నాడిన్ధమైః
కమ్పాతీరచరైః ఘనస్తనభరైః పుణ్యాంకురై శ్శాంకరైః॥

అ॥ హే మాతః - ఓ తల్లీ!, తంద్రాహీన - ఏమరపాటులేని (క్రొంగ్రొత్త అయిన), తమాల - కానుగ చెట్టు చివురుటాకులవలె, నీలసుషమైః - చామన చాయకాంతులు గలిగినట్టియు, తారుణ్యలీలాగృహైః - నవయౌవనమునకు స్థానమయినట్టియు, తారానాథకిశోర - చంద్రకళ (బాలచంద్రుడు), లాంఛితకచైః - లాంఛనముగా (చిహ్నముగా) గలకేశముగలట్టియు, తామ్రారవిన్దేక్షణైః - ఎఱ్ఱని తామరపువ్వులాంటి కనులుగలట్టియు, మనసిజప్రాగల్భ్య - ప్రౌఢమయిన మన్మథునకు, నాడింధమైః - విజృంభణము కలిగించునట్టియు, కంపాతీరచరైః - కంపానదీ తీరమున చరించునట్టియు, ఘనస్తనభరైః - పెద్దస్తనభారము గలిగినట్టియు, శాంకరైః - శివునకు సంబంధించిన, పుణ్యాంకురైః - పుణ్యపుమొలకలతో (కామాక్షితో), చేతః - నా మనస్సు, సత్క్రియతామ్ - సత్కరింపబడుగాక!

9. నిత్యం నిశ్చలతా ముపేత్య మరుతాం రక్షావిధిం పుష్ణతీ
తేజస్సంచయపాటవేన కిరణా నుష్ణద్యుతే ర్ముష్ణతీ।
కాంచీమధ్యగతాఽపి దీప్తిజననీ విశ్వాంతరే జృంభతే
కాచి చ్చిత్ర మహో స్మృతాపి తమసాం నిర్వాపికా దీపికా॥

అ॥ నిత్యం - ఎల్లపుడు, నిశ్చలతా ముపేత్య - కదలకుండి (నిశ్చలతను పొంది) మరుతాం - గాలులకు (దేవతలకు)రక్షావిధిం - రక్షణ విధానమును, పుష్ణతీ - పోషించునది యై, తేజస్సంచయపాటవేన - తేజః పుంజము యొక్క పటుత్వముతో, ఉష్ణద్యుతేః - వేడి కాంతి గల సూర్యుని, కిరణాన్ - కిరణములను, ముష్ణతీ - దొంగిలించునదియు, కాంచీమధ్యగతాపి - కాంచీనగర మధ్యమందుండియు, విశ్వాంతరే - ప్రపంచములోపల, దీప్తి జననీ - కాంతిని ప్రసరింపచేయునట్టి, కాచిత్ - ఒకానొక (అనిర్వచనీయమగు) దీపిక - దీపిక (కామాక్షి), స్మృతాపి - స్మరింపబడినదై, తమసాం నిర్వాపికా - చీకట్లను శమింపజేయునదియై, జృంభతే - విరాజిల్లుచున్నది, కాంచీ మధ్యగతా - నడుమునన్డొడ్డాణముగలది యని రెండవ యర్ధము, తమసామ్ - అజ్ఞాన వికారములను అనునది రెండవ యర్థము.

10. కాంతైః కేశరుచాం చయైః భ్రమరితం మన్దస్మితైః పుష్పితం
కాన్త్యా పల్లవితం పదామ్బురుహయోః నేత్రత్విషా పత్రితమ్।
కమ్పాతీర వనాన్తరం విదధతీ కల్యాణజన్మస్థలీం
కాంచీమధ్యమహామణి ర్విజయతే కాచిత్ కృపాకన్దళీ॥

అ॥ కాంతైః - మనోహరమయిన, కేశరుచాం - కేశముల కాంతుల, చయైః - సమూహములచేత, భ్రమరితమ్ - తుమ్మెదలు ముసిరినట్లు చేయబడినది, మందస్మితైః - చిరునగవులచే, పుష్పితమ్ - పూలు పూసినట్లయినది, పదాంబురుహయోః - పాదకమలముల, కాంత్యా - కాంతి చేత, పల్లవితమ్ - చిగిర్చినట్లయినది, నేత్రత్విషా - కన్నుల కాంతితో, పత్రితమ్ - ఆకుతొడిగినట్లయినది, ఏవం - ఈ విధముగా (అధ్యాహారము), కంపాతీరవనాంతరమ్ - కంపానదీ తీరవనమధ్యమును, కల్యాణ జన్మస్థలీమ్ - మంగళములకు నిలయమునుగా, విదధతీ - చేయుచు, కాంచీ మధ్య మహామణిః - కాంచీ పట్టణమధ్యమందున్న నాయకమణియగు, కాచిత్ - ఒకానొక, కృపాకందళీ - దయాంకురము, విజయతే - సర్వోత్కర్షతో వెలయుచున్నది.

11. రాకాచంద్రసమాన కాంతివదనా నాకాధిరాజస్తుతా
మూకానామపి కుర్వతీ సురధునీనీకాశ వాగ్వైభవమ్।
శ్రీ కాంచీనగరీ విహారరసికా శోకాపహన్త్రీ సతాం
ఏకా పుణ్యపరమ్పరా పశుపతే రాకారిణీ రాజతే॥

అ॥ రాకాచంద్ర - పూర్ణ చంద్రునితో, సమానకాంతి - పోలదగిన కాంతిమంతమయిన, వదనా - ముఖము కలిగినట్టియు, నాకాధిరాజస్తుతా - స్వర్గాధిపతియగు ఇంద్రునిచే నుతింపబడినట్టియు, మూకానామపి - మూగవారలకు గూడ, సురధునీనీకాశ - ఆకాశగంగతో సమానమగు, వాగ్వైభవమ్ - వాక్కుల అతిశయమును, కుర్వతీ - చేయుచున్నట్టియు, సతాం - సత్పురుషులకు, శోకాపహన్త్రీ - శోకమును పోగొట్టునట్టియు, శ్రీ కాంచీనగరీ విహారరసికా - కాంచీపట్టణమందు విహరించుటలో ఆసక్తిగలట్టియు, పశుపతేః - శివుని యొక్క, ఏకపుణ్యపరమ్పరా - విశిష్టమైన పుణ్యాలరాశి, ఆకారిణీ - ఆకారముగలదియై, రాజతే - విరాజిల్లుచున్నది. ఇక్కడ శివుడు ఏకామ్రనాథుడు. మూగవారికి గూడ అనర్గళ కవితాధార అలవడునని చెప్పుట మూకపంచశతికి మూలాధారమయిన విషయము.

12. జాతా శీతలశైలత స్సుకృతినాం దృశ్యా పరం దేహినాం
లోకానాం క్షణమాత్రసంస్మరణతః సంతాపవిచ్ఛేదినీ।
ఆశ్చర్యం బహుఖేలనం వితనుతే నైశ్చల్య మాబిభ్రతీ
కమ్పాయాస్తటసీమ్ని కాపి తటినీ కారుణ్యపాథోమయీ॥

అ॥ శీతలశైలతః - మంచుకొండ (హిమాలయము) నుండి, జాతా - పుట్టినట్టియు, సుకృతినాం - పుణ్య వంతులయిన, దేహినాం పరం - ప్రాణులకు మాత్రము, దృశ్యా - కనబడునట్టియు, క్షణమాత్ర సంస్మరణతః - క్షణమాత్రము స్మరించుట చేతనే, లోకానాం - ప్రజల యొక్క, సంతాపవిచ్ఛేదినీ - సంతాపమును పోగొట్టునట్టియు, కమ్పాయా స్తటసీమ్ని - కంపానదీతీరమున, కారుణ్యపాథోమయీ - కరుణయను జలమయ మూర్తియయిన, కాపి తటినీ - ఒకానొక నది (అమ్మవారు), నైశ్చల్యమాబిభ్రతీ - నిశ్చలత్వమును వహించుచు, ఆశ్చర్యమ్ - ఆశ్చర్యము కలిగించు, బహు ఖేలనమ్ వితనుతే - బహు విధ విహారమును విస్తరింప జేయుచున్నది.

13. ఐక్యం యేన విరచ్యతే హరతనౌ దంభావపుంభావకే
రేఖా యత్కచసీమ్ని శేఖరదశాం నైశాకరీ గాహతే।
ఔన్నత్యం ముహురేతి యేన స మహాన్ మేనాసఖ స్సానుమాన్
కంపాతీరవిహారిణా సశరణాః తేనైవ ధామ్నా వయమ్॥

అ॥ దంభావ పుంభావకే - దాంభికమైన పురుషత్వముగల (అర్ధనారీశ్వరస్వరూపమయిన), హరతనౌ - శివుని శరీరమందు, యేన - ఏదేవిచేత, ఐక్యమ్ - ఏకత్వము, విరచ్యతే - సంపాదింపబడుచున్నదో, (శివుడేతానై ఎవతెయున్నదో), యత్కచసీమ్ని - ఏదేవి కేశ ప్రదేశమున, నైశాకరీ రేఖా - చంద్రకళ (నిశాకరుడనగా చంద్రుడు, ఆతనికి సంబంధించిన రేఖ = రేఖ), శేఖరదశాం గాహతే - శిరోభూషణ మయినదో, యేన - ఏదేవి చేత, సః - ప్రసిద్ధుడయిన, మేనాసఖః - మేనాదేవి ప్రియుడయిన, మహాన్ సానుమాన్ - గొప్ప పర్వతరాజు (హిమవంతుడు), ముహుః - మఱిలమఱల, ఔన్నత్యమేతి - ఉన్నతత్వమును పొందుచున్నాడో, కంపాతీరవిహారిణా - కంపాతీరమున విహరించు, తేన ధామ్నాఏవ - ఆ తేజస్సుతోనే, వయమ్ - మేము (నేను అని అర్థము), సశరణాః - సంరక్షకులు గలవారము. (స్మః లేక భావామః - అయియున్నాము అని అధ్యాహారము)

14. అక్ష్ణోశ్చ స్తనయోః శ్రియా శ్రవణయోః బాహ్వోశ్చ మూలంస్పృశ
న్నుత్తంసేన ముఖేన చ ప్రతిదినం ద్రుహ్యాన్ పయోజన్మనే।
మాధుర్యేణ గిరాం గతేన మృదునా హంసాంగనాం హ్రేపయన్
కాంచీసీమ్ని చకాస్తి కోఽపి కవితాసంతాన బీజాంకురః॥

అ॥ అక్ష్ణోః - కన్నుల యొక్క, శ్రియా - శోభతో, శ్రవణయోః - చెవులయొక్క, మూలంస్పృశన్ - మూలమును దాకుచు, స్తనయోశ్చ శ్రియా - స్తనముల సొగసుతోను, బాహ్వోశ్చ మూలంస్పృశన్ - బాహుమూలమును (చంకను) దాకుచు, ఉత్తంసేన - శిరోభూషణముతో (చంద్రకళతో), ముఖేన చ - ముఖముతోను, ప్రతిదినమ్ - ప్రతిదినము, పయోజన్మనే - కమలమునకు, ద్రుహ్యాన్ - ద్రోహము చేయుచు, (తామరపువ్వు నతిశయించుచు), గిరాం మాధుర్యేణ - వాఙ్మాధుర్యముతోను, హంసాంగనామ్ - ఆడుహంసను, హ్రేపయన్ - సిగ్గుపడునట్లు చేయుచు, కోఽపి - ఒకానొక అనిర్వచనీయమగు, కవితా సంతాన బీజాంకురః - కవితయను కల్పవృక్షమునకు మూలమయిన లేమొలక, కాంచీసీమ్ని - కాంచీపురమున, చకాస్తి - విలసిల్లుచున్నది.

15. ఖండం చాంద్రమసం వతంస మనిశం కాంచీపురే ఖేలనమ్
కాలాయచ్ఛవితస్కరీం తనురుచిం కర్ణేజపే లోచనే।
తారుణ్యోష్మ నఖంపచస్తనభరం జంఘాస్పృశం కుంతలం
భాగ్యం దేశికసంచితం మమ కదా సమ్పాదయే దమ్బికే॥

అ॥ అమ్బికే - తల్లీ!, చాంద్రమసం ఖండమ్ (చాంద, కా, టుకడా) - చంద్రకళ, అనిశం వతంసమ్ - శాశ్వతముగా నుండు శిరోభూషణము, కాంచీ పురే ఖేలనమ్ - కాంచీపట్టణమందు విహారము, కాలాయచ్ఛవి తస్కరీమ్ - కలాయ మను పువ్వు కాంతిని దొంగిలించు, తనురుచిం - దేహ కాంతిని, కర్ణేజపే లోచనే - చెవులదాక విస్తరించిన కనులను, తారుణ్యోష్మ నఖంపచస్తనభరమ్ - యౌవన మందలి నును వెచ్చదనముచే గోరు వెచ్చనగు స్తనములను, జంఘా స్పృశమ్ - పిక్కలను దాకు, కున్తలమ్ - తలకట్టును కల్గినట్టి, దేశికసంచితం భాగ్యమ్ - గురువులు సంపాదించిన భాగ్యము, మమ - నాకు, కదా - ఎప్పుడు, సమ్పాదయేత్ - లభింపగల్గునో!

16. తన్వానం నిజకేళిసౌధసరణిం నైసర్గికీణాం గిరామ్
కేదారం కవిమల్ల సూక్తిలహరీం సస్య శ్రియాం శాశ్వతమ్।
అంహోవంచనచుంచు కించన భజే కాంచీపురీమండనమ్
పర్యాయచ్ఛవి పాకశాసనమణేః పౌష్పేషవం పౌరుషమ్॥

అ॥ నైసర్గికీణాం గిరామ్ - ప్రకృతిసిద్ధమైన వాక్కులకు (వేదములకు), నిజకేళి సౌధసరణిం - తన విహార మండపమార్గమును, తన్వానం - విస్తరింప జేయునట్టిదియు, కవి మల్ల - కవిశ్రేష్ఠుల యొక్క, సూక్తిలహరీ - సుభాషితములను అలల యొక్క, సస్యశ్రియామ్ - పంటల తాలూకు అందచందములకు, శాశ్వతం కేదారం - శాశ్వత క్షేత్రమయినట్టియు, అంహోవంచన చుంచు - పాపక్షాళన సమర్థమైనట్టియు, పాకశాసనమణేః - ఇంద్రనీలమణికి, పర్యాయచ్ఛవి - సమానమైన కాంతి గల్గినట్టియు, కించన - ఒకానొక అనిర్వచనీయమగు, పౌష్పేషవం పౌరుషమ్ - మన్మథుని పరాక్రమ మనదగిన (పుష్పములు ఇషువులు అనగాబాణములు గల మదనుని పురుషకార మనుట), కాంచీపురీ మండనమ్ - కాంచీనగరమునకు అలంకారమగు కామాక్షిని, భజే - సేవించుచున్నాను.

17. ఆలోకే ముఖపంకజే చ దధతీ సౌధాకరీం చాతురీమ్
చూడాలంక్రియమాణ పంకజవనీ వైరాకరప్రక్రియా।
ముగ్ధస్మేరముఖీ ఘనస్తనతటీ మూర్ఛాలమధ్యాంచితా
కాంచీసీమని కామినీ విజయతే కాచి జ్జగన్మోహినీ॥

అ॥ ఆలోకే - చూపునందు, ముఖపంకజే చ - ముఖపద్మమందును, సౌధాకరీం చాతురీమ్ - చంద్రుని సౌందర్యమును, దధతీ - ధరించుచున్నట్టియు, చూడాలంక్రియమాణ - కేశములకలంకారమును, పంకజవనీ వైరాకర - పద్మములకు శత్రువయిన చంద్రుని, ప్రక్రియా - ప్రకారము అనగా కళ కలిగినట్టియు, ముగ్ధస్మేరముఖీ - అందమయిన చిరునవ్వు గల ముఖము గలిగినట్టియు, ఘనస్తనతటీ - పెద్దస్తన భారము తో, మూర్ఛాల మధ్యాంచితా - స్రుక్కిపోవు సన్నని నడుము గల్గినట్టి, జగన్మోహినీ - జగన్మోహనాకారముగల, కాచిత్ కామినీ - ఒకానొక కామిని, కాంచీ సీమని - కాంచీనగర ప్రదేశమందు, విజయతే - ఒప్పారు చున్నది.

18. యస్మి న్నంబ భవత్కటాక్షరజనీ మన్దేఽపి మన్దస్మిత
జ్యోత్స్నాసంస్నపితా భవ త్యభిముఖీ తం ప్రత్యహో దేహినమ్।
ద్రాక్షా మాక్షిక మాధురీ మదభర వ్రీడాకరీ వైఖరీ
కామాక్షి స్వయ మాతనో త్యభిసృతిం వామేక్షణేవ క్షణాత్॥

అ॥ అంబ, కామాక్షి - అమ్మా కామాక్షీ, యస్మిన్ మన్దేపి - మూఢుడయినను ఎవని యందు, భవత్కటాక్ష - నీ కడగంటి చూపు అను, రజనీ - రాత్రి, మన్దస్మిత - చిరునగవనునట్టి, జ్యోత్స్నా - వెన్నెలతో, సంస్నపితా - తడుపబడినదై, అభిముఖీ భవతు - అభిముఖమగునో, తం దేహినం ప్రతి - ఆ జీవుని గూర్చి, ద్రాక్షా - ద్రాక్ష పండ్ల యొక్కయు, మాక్షిక - తేనె యొక్కయు, మాధురీమదభర - తియ్యదనపు మదభారమునకు, వ్రీడాకరీ - సిగ్గు తెచ్చునట్టి, వైఖరీ - వైఖరీ వాక్కు, వామేక్షణేవ - సుందరాంగివలె, క్షణాత్ - క్షణములో, స్వయం - స్వయముగా, అభిసృతిమ్ తనోతి - అభిసారికగా వచ్చును.

19. కాళిన్దీజలకాన్తయః స్మితరుచి స్వర్వాహినీపాథసి
ప్రౌఢధ్వాన్తరుచః స్ఫుటాధరమహో లౌహిత్యసంధ్యోదయే।
మాణిక్యోపలకుండలాంశుశిఖిని వ్యామిశ్రధూమశ్రియమ్
కల్యాణైకభువః కటాక్షసుషమాః కామాక్షి రాజన్తి తే॥

అ॥ హే కామాక్షీ - ఓ కామాక్షీ, కల్యాణైకభువః - మంగళములకు నిలయమైన, తే - నీయొక్క, కటాక్షసుషమాః - క్రీగంటి శోభలు, స్మితరుచి - చిరునవ్వనెడు, స్వర్వాహినీ పాథసి - గంగాజలమందు, కాళిందీ జలకాంతయః - యమునా జలకాంతులుగాను, స్ఫుటాధర మహో - స్పష్టమైన క్రింది పెదవి కాంతి యొక్క, లౌహిత్యసంధ్యోదయే - ఎఱ్ఱదనమను సంధ్యా కాలము మొదలయినపుడు, ప్రౌఢధ్వాన్తరుచః - చిక్కని చీకటి కాంతులుగాను, మాణిక్యోపలకుండల - మాణిక్యపు రాతితో చేసిన కుండలముల, అంశు శిఖిని - కిరణములను అగ్ని యందు, వ్యామిశ్ర - కలసిపోయినట్టి, ధూమ - పొగయొక్క, శ్రియః - శోభలుగాను, రాజన్తి - ఒప్పారుచున్నవి.

20. కలకల రణత్కాంచీ కాంచీవిభూషణమాలికా
కచభర లసచ్చంద్రా చంద్రావతంస సధర్మిణీ।
కవికులగిరః శ్రావం శ్రావం మిల త్పులకాంకురా
విరచితశిరః కమ్పా కమ్పాతటే పరిశోభతే॥

అ॥ కలకల - కలకల నినాదముతో, రణత్కాంచీ - మ్రోయు యొడ్డాణము గల్గినట్టియు, కచభర - కేశపాశము మీద, లసచ్చంద్రా - ఒప్పారుచున్న చంద్రుడు గలట్టియు, చంద్రావతంస - చంద్రుడు శిరోభూషణముగాగల శివుని, సధర్మిణీ - ధర్మపత్ని (కామాక్షి), కవికుల - అనేక కవి బృందముల, గిరాం - వాక్కులను, శ్రావంశ్రావం - విని, విని, మిలత్ పులకాంకురా - మిళితమైన పులకాంకురములు (గగుర్పాటు) కలదియై, విరచిత శిరః కమ్పా - చేయబడిన శిరః కమ్పము కలదియై, కమ్పాతటే - కంపానదీ తీరమున, పరిశోభతే - శోభిల్లు చున్నది.

21. సరసవచసాం వీచీ నీచీభవ న్మధుమాధురీ
భరితభువనా కీర్తిః మూర్తి ర్మనోభవజిత్వరీ।
జనని మనసో యోగ్యం భోగ్యం నృణాం తవ జాయతే
కథమివ వినా కాంచీభూషే కటాక్షతరంగితమ్॥

అ॥ కాంచీ భూషే - కంచికి అలంకారమయిన, జనని - ఓ తల్లీ!, నీచీభవత్ - తక్కువయైపోవుచు, మధుమాధురీ - తేనె తియ్యదనముగల, సరసవచసాం వీచీ - రసభరితమైన వాగ్లహరియు (వాక్కుల అల లేకప్రవాహము), భరిత భువనాకీర్తిః - విశ్వమంతయు నిండిన కీర్తియు, మనోభవ జిత్వరీ - మన్మథుని జయించు, మూర్తిః - ఆకారమును, మనసః - మనస్సుకు, యోగ్యమ్ - తగిన, భోగ్యమ్ - భోగింపతగిన పదార్థము, తవ - నీ యొక్క, కటాక్షతరంగితం - క్రీగంటి చూపు అను అలను, వినా - వీడి (లేకుండ), నృణాం - మనుష్యులకు, కథమివ - ఏవిధముగా (నయిన), జాయతే - కలుగును?

22. భ్రమరితసరిత్కూలే నీలోత్పలప్రభయా భయా
నత జనతమఃఖండీ తుండీరసీమ్ని విజృంభతే।
అచలతపసా మేకః పాకః ప్రసూనశరాసన
ప్రతిభటమనోహారీ నారీకులైకశిఖామణిః॥

అ॥భయానత - భయముతో ప్రణతులైన, జన - భక్తజనుల, తమఃఖండీ - అజ్ఞాన మను చీకటిని ఖండించునట్టియు, అచలతపసామ్ - హిమవంతుని తపస్సులకు, ఏకః - ముఖ్యమయిన, పాకః - పరిపాకము నైనట్టియు, ప్రసూన శరాసన - పూలు బాణములుగా గల మన్మథునకు, ప్రతిభట - ప్రతిపక్షుడయిన శివుని, మనోహారీ - మనస్సును హరించి నైచునట్టియు, నారీకుల - స్త్రీ కుల మంతటకు, ఏక - ముఖ్య, శిఖామణిః - శిరోమణి అయిన కామాక్షి, నీలోత్పల ప్రభయా - నల్ల కలువలబోలు కనుల కాంతితో, భ్రమరిత సరిత్కూలే - చుట్టుముట్టిన కంపానదీ తీరము గల, తుండీరసీమ్ని - తుండీరమండలమున విజృంభతే - విరాజిల్లుచున్నది.

23. మధురవచసో మన్దస్మేరా మతంగజగామినః
తరుణిమజుష స్తాపింఛాభా స్తమఃపరిపన్థినః।
కుచభరనతాః కుర్యు ర్భద్రం కురంగవిలోచనాః
కలితకరుణాః కాంచీభాజః కపాలిమహోత్సవాః॥

అ॥ మధురవచసః - మధురమైన వాక్కులు గల్గినట్టియు, మన్దస్మేరాః - మందమయిన చిరునవ్వు గలట్టియు, మతంగజగామినః - ఏనుగువలె నడచు నట్టియు, తరుణిమజుషః - యౌవనమును పొందినట్టియు, తాపింఛాభాః - ఇఱుగుడు మ్రాని తళుకులు గలిగినట్టియు, తమఃపరిపన్థినః - అజ్ఞానమునకు విరోధులయి నట్టియు, కుచభరనతాః - స్తనభారముతో వంగినట్టియు, కురంగవిలోచనాః - జింక కన్నుల వంటి కన్నులు కలిగినట్టియు, కలిత కరుణాః - ఒప్పుచున్న కారుణ్యము గలట్టియు, కాంచీభాజః - కాంచీనగరమందున్న, కపాలిమహోత్సవాః - శంకరుని పండుగలనదగిన కామాక్షీ దేవి అమ్మవారు, భద్రం - క్షేమమును (మంగళమును), కుర్యుః - చేయుదురుగాక!.

24. కమలసుషమాకక్ష్యారోహే విచక్షణవీక్షణాః
కుముదసుకృతక్రీడా చూడాలకున్తల బంధురాః।
రుచిరరుచిభి స్తాపింఛశ్రీ ప్రపంచనచుంచవః
పురవిజయినః కమ్పాతీరే స్ఫురన్తి మనోరథాః॥

అ॥ పురవిజయినః - త్రిపురముల గెల్చిన శివుని యొక్క, మనోరథాః - కోరికలు, (కోరికలకు ప్రోగులై కామాక్షి రూపముగ నున్నవి), కమలసుషమా - తామరపూవుల మీదుమిక్కిలిశోభయొక్క, కక్ష్యారోహే - కక్ష్యను అధిరోహించుటలో, విచక్షణ వీక్షణాః - నేర్పుగల చూపులు గలవియై, కుముద - కలువ పూవుల, సుకృతక్రీడా - పుణ్యముల విహారములు (చంద్రుడు), చూడాల - శిరోభూషణముగా గల, కున్తల - కేశములతో, బన్ధురాః - ఒప్పుచున్నవియై, రుచిరరుచిభిః - అందమైన కాంతులతో, తాపింఛశ్రీ - ఇఱుగుడు మ్రాని శోభను, ప్రపంచన - విస్తరించుట యందు, చుంచవః - సమర్థములై, కంపాతీరే - కంపానదీ తీరమున, స్ఫురన్తి - శోభిల్లుచున్నవి.

25. కలితరతయః కాంచీలీలావిధౌ కవిమండలీ
వచనలహరీ వాసన్తీనాం వసన్తవిభూతయః।
కుశలవిధయే భూయాసు ర్మే కురంగవిలోచనాః
కుసుమవిశిఖారాతే రక్ష్ణాం కుతూహలవిభ్రమాః॥

అ॥ కాంచీ లీలావిధౌ - కంచిలో విహరించు విధానములో, కలితరతయః - ఒప్పిన ఆసక్తిగలవియు, కవిమండలీ - కవిబృందముల, వచనలహరీ - వాక్కుల తరంగములను, వాసన్తీనాం - పూలగురివెంద తీగలకు, వసన్త విభూతయః - వసం తర్తు సంపదలగునట్టియు, కురంగవిలోచనాః - జింకకన్నుల వంటి కన్నులు గలిగినట్టియు, కుసుమవిశిఖ - పువ్వులు బాణములుగాగల మన్మథునకు, అరాతేః - శత్రువగు శంకరుని, అక్ష్ణామ్ - మూడు కన్నులకు, కుతూహల విభ్రమాః - వేడుకలు కలిగించు విలాసములు (అనగా కామాక్షీ దేవీ కటాక్షములు), మే - నా యొక్క, కుశలవిధయే - క్షేమంకరమగు విధానము కొఱకు, భూయాసుః - అగును గాక.

26. కబళితతమస్కాండాః తుండీరమండల మండనాః
సరసిజవనీ సన్తానానా మరున్తుద శేఖరాః।
నయనసరణే ర్నేదీయాంసః కదాను భవన్తి మే!
తరుణజలదశ్యామా శ్శంభో స్తపఃఫల విభ్రమాః॥

అ॥ కబళిత - మ్రింగబడిన, తమస్కాండాః - చీకట్లగుంపు (అజ్ఞానము)గలట్టియు, తుండీరమండల - తుండీరమను పేరుగల జిల్లాకు, మండనాః - అలంకారములయినట్టియు, సరసిజ వనీ - తామరపూల సమూహముల, సన్తానానామ్ - పరంపరలకు (తామర తంపరలకు), అరుంతుద - మితిమీరిన పీడగలిగించు (చంద్రుడు), శేఖరాః - శిరోభూషణము గలిగినట్టియు, తరుణ - నవీనమయిన, జలద - మేఘమువలె, శ్యామాః - నీలములయినట్టియు, శంభోః - శివుని యొక్క, తపఃఫల - తపస్సునకు ఫలితమైన, విభ్రమాః - విలాసములు (అనగా విలాసములు గల కామాక్షీ అమ్మవారు), మే - నా యొక్క, నయన సరణేః - కనుచూపు మేరకు, నేదీయాంసః - చాలదగ్గరవి, కదాను - ఎప్పుడు అయిన, భవన్తి - అగును (నా?).

27. అచరమ మిషుం దీనం మీనధ్వజస్య ముఖశ్రియా
సరసిజభువో యానం మ్లానం గతేన చ మంజునా।
త్రిదశసదసా మన్నం ఖిన్నం గిరా చ వితన్వతీ
తిలకయతి సా కమ్పాతీరం త్రిలోచనసున్దరీ॥

అ॥ మీనధ్వజస్య - చేప జెండా కలిగిన మన్మథుని యొక్క, అచరమ మిషుమ్ - మొదటి బాణమయిన పద్మమును, ముఖశ్రియా - ముఖశోభతో, దీనం వితన్వతీ - దీనముగా జేయుచు, సరసిజ భువః - కమలమందు జనించిన బ్రహ్మ దేవుని యొక్క, యానమ్ - వాహనమగు హంసను, మంజునా - మనోహరమయిన, గతేన - నడకతో, మ్లానమ్ - వాడినదానినిగా (ఓడినదానిగా), వితన్వతీ - చేయుచు, త్రిదశసదసామ్ - దేవతా సదస్సుల, అన్నం చ - అన్నమగు అమృతమునూ, గిరా - వాక్కుతో, ఖిన్నం - దుఃఖించిన దానిగాను, వితన్వతీ - చేయుచున్నదియై, సా త్రిలోచనసున్దరీ - ఆ ముక్కంటిపడతి (కామాక్షి) , కమ్పాతీరమ్ - కంపానదీ తటమును, తిలకయతి - అలంకరించుచున్నది.

28. జనని భువనే చంక్రమ్యేఽహం కియన్త మనేహసమ్
కుపురుషక రభ్రష్టైః దుష్టైర్ధనై రుదరమ్భరిః।
తరుణకరుణే తంద్రాశూన్యే తరంగయ లోచనే
నమతి మయి తే కించిత్ కాంచీపురీ మణిదీపికే॥

అ॥ కుపురుషక రభ్రష్టైః - దుర్మార్గుల చేతులనుండి విదల్చ బడిన, దుష్టైర్ధనైః - చెడ్డ ధనములతో, ఉదరంభరిః - పొట్టనింపుకొనునట్టి, అహమ్ - నేను, కి యన్తమనేహసమ్ - ఎంతకాలమును, భువనే - లోకమందు, చంక్రమ్యే - ప్రాకులాడుదును?, తరుణ కరుణే - కొత్తగాచిగురించు దయగలదానా, తంద్రాశూన్యే - ఏమఱుపాటులేని, హే జనని - ఓ తల్లీ, కాంచీపురీ - కాంచీనగరానికి, మణిదీపికే - మణిదీపమా!, మయి నమతి - నేను నమస్కరించు చుండగా, తే - నీ యొక్క, లోచనే - కనులను (చూపులను), తరంగయ - అలలుగా వెలయింపుము.

29. మునిజనమనఃపేటీరత్నం స్ఫురత్కరుణానటీ
విహరణకలాగేహం కాంచీపురీ మణిభూషణమ్।
జగతి మహతో మోహవ్యాధే ర్నృణాం పరమౌషధం
పురహరదృశాం సాఫల్యం మే పురః పరిజృంభతామ్॥

అ॥ మునిజన - మునులయొక్క, మనః పేటీ - మనస్సను పెట్టె నుండు, రత్నమ్ - రత్నమయినట్టియు, స్ఫురత్కరుణా - ప్రస్ఫురితమైన కరుణయను, నటీ - నటీమణికి, విహరణ - విహరించుటకయిన, కలాగేహమ్ - విలాస గృహమయినట్టియు, కాంచీపురీ - కంచియనునగరానికి, మణిభూషణమ్ - రత్నమయాలంకారమయినట్టియు, జగతి - జగత్తున, నృణామ్ - మనుజులకు, మహతః - గొప్ప, మోహవ్యాధేః - మోహమనురోగానికి, పరమౌషధమ్ - ఉత్తమమగు ఔషధమైనట్టియు, పురహర - శివుని యొక్క, దృశామ్ - చూపులకు, సాఫల్యమ్ - సఫలత్వము గూర్చు కామాక్షి, మే పురః - నాముందు, పరిజృంభతామ్ - విలసిల్లుగాత!.

30. మునిజనమనోధామ్నే ధామ్నే వచోమయజాహ్నవీ
హిమగిరితట ప్రాగ్భారా యాక్షరాయ పరాత్మనే।
విహరణజుషే కాంచీదేశే మహేశ్వరలోచన
త్రితయ సరసక్రీడా సౌధాంగణాయ నమో నమః॥

అ॥ మునిజన - మునుల యొక్క, మనోధామ్నే - మనస్సుకు స్థానమయిన, ధామ్నే - తేజస్స్వరూపమయినట్టియు, వచోమయ - వాక్కుల రూపమయిన, జాహ్నవీ - గంగానదికి, హిమగిరితట - హిమాలయసానువుల, ప్రాగ్భారాయ - ఎత్తైన ముందుభాగమైనట్టియు, అక్షరాయ - శాశ్వతమైనట్టియు, పరాత్మనే - పరమాత్మస్వరూపమైనట్టియు, కాంచీదేశే - కాంచీనగరమందు, విహరణజుషే - విహారమును చెందునట్టియు, మహేశ్వర - శివుని యొక్క, లోచనత్రితయ - మూడు కన్నుల, సరసక్రీడా - సరసక్రీడలకు, సౌధాంగణాయ - ప్రాసాదపుముంగిలి అయిన కామాక్షీ దేవికి, నమోనమః - మాటికి మాటికి నమస్కారము.

31. మరకతరుచాం ప్రత్యాదేశం మహేశ్వరచక్షుషామ్
అమృతలహరీపూరం పారం భవాఖ్యపయోనిధేః
సుచరిత ఫలం కాంచీభాజో జనస్య పచేలిమమ్
హిమశిఖరిణో వంశ స్యైకం వతంస ముపాస్మహే॥

అ॥ మరకతరుచాం ప్రత్యాదేశమ్: - మరకతమణికాంతులకు తిరస్కారమైనట్టియు, మహేశ్వర - శివుని యొక్క, చక్షుషామ్ - కన్నులకు, అమృతలహరీపూరమ్ - అమృత తరంగప్రవాహమైనట్టియు, భవాఖ్య - సంసారమనెడు, పయోనిధేః - సముద్రమునకు, పారమ్ - అవతలిఒడ్డు అయినట్టియు, కాంచీ భాజః - కాంచీనగరమందున్న, జనస్య - మానవునకు, పచేలిమమ్ - పరిపక్వమయిన, సుచరితఫలమ్ - పుణ్యమునకు ఫలితమైనట్టియు, హిమశిఖరిణః - హిమవంతుని యొక్క, వంశస్య - వంశమునకు, ఏకం - ఒకే ఒక, వతంసమ్ - శిరోభూషణమును (కామాక్షిని), ఉపాస్మహే - సేవించుచున్నాము.

32. ప్రణమనదినారంభే కంపానదీసఖి తావకే
సరస కవితోన్మేషః పూషా సతాం సముదంచితః
ప్రతిభట మహాప్రౌఢప్రోద్య త్కవిత్వకుముద్వతీమ్
నయతి తరసా నిద్రాముద్రాం నగేశ్వరకన్యకే॥

అ॥ హే కంపానదీసఖి - ఓ కంపానదీ సఖురాలా, నగేశ్వరకన్యకే - హిమవంతుని కుమార్తెవగు కామాక్షీ, తావకే - నీకు సంబంధించు, ప్రణమనదినారంభే - నమస్కారముచేయు తొలిదినమునాడు, సతామ్ - సత్పురుషులకు, సరసకవితోన్మేషః పుషా - సరసమయిన కవితావికాసమను సూర్యుడు, సముదంచితః - ఉదయించినవాడై, ప్రతిభట - ప్రతిపక్షుల యొక్క, మహాప్రౌఢ - గొప్పప్రౌఢి గలిగి, ప్రోద్యత్ - మిక్కిలి పైకి పొంగుచున్న, కవిత్వ - కవిత్వమను, కుముద్వతీమ్ - కలువతీగను, తరసా - త్వరగా, నిద్రాముద్రామ్ - నిద్రాముద్రను, నయతి - పొందించును.

33. శమితజడిమారంభా కంపాతటే నికటేచరీ
నిహతదురితస్తోమా సోమార్ధముద్రితకున్తలా।
ఫలితసుమనోవాంఛా పాంచాయుధీ పరదేవతా
సఫలయతు మే నేత్రే గోత్రేశ్వరప్రియనన్దినీ॥

అ॥ శమిత - శమింపజేయబడిన, జడిమారంభా - జాడ్యము యొక్క ఆది కలిగినట్టియు, నిహత - కొట్టివేయబడిన, దురిత - పాపముల యొక్క, స్తోమా - సమూహము గలిగినట్టియు, సోమార్ధ - చంద్రుని సగభాగము, ముద్రిత - గుర్తుగా గల, కున్తలా - ముంగురులు గలిగినట్టియు, ఫలిత - ఫలింపజేసిన, సుమనోవాంఛా - సత్పురుషుల యొక్కయు దేవతల యొక్కయు కోర్కెలుగలట్టియు, పాంచాయుధీ - మన్మథాకారముగల, పరదేవత - పరదేవతయగు, గోత్రేశ్వర - పర్వతరాజగు హిమవంతుని యొక్క, ప్రియనన్దినీ - ఇష్టమయిన కూతురు (పార్వతి), కంపాతటే - కంపానదీతీరమున, నికటేచరీ - దగ్గరలో సంచరించునదియై (కామాక్షీరూపముగా), మే నేత్రే - నాకన్నులను, సఫలయతు - సఫలముచేయుగాక (దర్శనమిచ్చుగాక).

34. మమ తు ధిషణా పీడ్యా జాడ్యాతిరేక కథం త్వయా
కుముదసుషమా మైత్రీ సమ్యగ్వతంసితకున్తలామ్।
జగతి శమిత స్తంభాం కంపానదీనిలయా మసౌ
శ్రయతి హి గలత్తంద్రా చంద్రావతంస సధర్మిణీమ్॥

అ॥ హే జాడ్యాతిరేక - ఓ మితిమీరిన జడత్వమా, మమ - నాయొక్క, ధిషణాతు - బుద్ధి మాత్రము, త్వయా - నీ చేత, కథంపీడ్యా - ఎట్లు పీడింపబడును?, హి - ఎందువల్లననగా, అసౌ - ఈ నాబుద్ధి, కుముదసుషమా - కలువ పూవుల శోభతో, మైత్రీ - స్నేహము రూపుదాల్చిన చంద్రకళతో, వతంసిత కున్తలామ్ - అలంకృతమైన కేశములు గలట్టియు, జగతి - విశ్వమందు, శమిత స్తంభాం - శాంతింపజేయబడిన స్తబ్దత గలట్టియు, చంద్రావతంస - చంద్రుడు శిరోభూషణమైన శివుని, సధర్మిణీమ్ - సహధర్మచారిణియైన, కంపానదీనిలయామ్ - కంపానదీతటనివాసమున్న కామాక్షిని, గలత్తంద్రా - ఏమఱుపాటులేనిదై, శ్రయతి - ఆశ్రయించుచున్నది.

35. పరిమలపరీపాకోద్రేకం పయోముచి కాంచనే
శిఖరిణి పునర్ ద్వైధీభావం శశి న్యరుణాతపమ్।
అపి చ జనయన్ కంబో ర్లక్ష్మీ మనంబుని కోఽప్యసౌ
కుసుమధనుషః కాంచీదేశే చకాస్తి పరాక్రమః॥

అ॥ పయోముచి - నీలమేఘమునందు (నల్లని కేశపాశమున), పరిమల - సుగంధము యొక్క, పరీపాకోద్రేకమ్ - అతిశయించిన పరిపాకమును (పూలసుగంధవిశేషమును), కాంచనే శిఖరిణి - బంగారు కొండమీద, పునః - మాత్రము, ద్వైధీభావమ్ - రెండుగానగుటను (బంగారు కాంతి గల రెండు స్తనములను), శశిని - చంద్రుని యందు, అరుణాతపమ్ - లేయెండ కాంతిని (ఎఱ్ఱని క్రింది పెదవి శోభను), అపిచ - మఱియు, అనంబుని - నీళ్ల లేని చోట, కంబోః - శంఖము యొక్క, లక్ష్మీమ్ - శోభను (శంఖము బోలిమూడు రేఖలున్న కంఠమును), అసౌ - ఈ, కుసుమధనుషః - మన్మథుని యొక్క, కోఽపి - ఒకానొక, పరాక్రమః - పరాక్రమము (కామాక్షి), కాంచీదేశే - కాంచీనగరమందు, చకాస్తి - ప్రకాశించుచున్నది.

36. పురదమయితు ర్వామోత్సంగస్థలేన రసజ్ఞయా
సరసకవితాభాజామ్ కాంచీపురోదరసీమయా।
తటపరిసరైః నీహారాద్రేః వచోభి రకృత్రిమైః
కిమివ న తులా మస్మచ్చేతో మహేశ్వరి గాహతే॥

అ॥ హే మహేశ్వరి - ఓ పరమేశ్వరి, పురదమయితుః - త్రిపురారియయిన శివుని యొక్క, వామోత్సంగస్థలేన - ఎడమతొడ తోను, సరస - అందమైన, కవితా - కవితను, భాజామ్ - పొందిన కవుల, రసజ్ఞయా - నాల్కతోను, కాంచీపుర - కంచి నగరము యొక్క, ఉదరసీమయా - లోపలిభాగముతోను, నీహారాద్రేః - మంచు కొండ యొక్క (హిమవంతుని), తటపరిసరైః - తటప్రాంతములతోను, అకృత్రిమైః - కల్పితములుకాని, వచోభిః - వాక్కులతోను (వేదముతోను), తులామ్ - పోలికను, అస్మచ్చేతః - నామనస్సు, కిమివ - ఎందుకని, న గాహతే - పొందదు? (కామాక్షీ ధ్యానము చేత నామనస్సు పై చెప్పినవానిని పోలియున్నది).

37. నయనయుగలీ మాస్మాకీనాం కదాను ఫలేగ్రహీమ్
విదధతి గతౌ వ్యాకుర్వాణా గజేంద్ర చమత్క్రియామ్।
మరకతరుచో మాహేశానా ఘనస్తననమ్రితాః
సుకృత విభవాః ప్రాంచః కాంచీవతంసధురంధరాః॥

అ॥ గతౌ - నడకయందు, గజేంద్ర చమత్క్రియామ్ - గజరాజుహొయలును, వ్యాకుర్వాణాః - వివరించుచున్నవై, ఘన స్తననమ్రితాః - గొప్పస్తనభారముతో వంచబడినవై, ప్రాంచః సుకృతవిభవాః - పురాతన పుణ్యరాసులు, కాంచీవతంస ధురంధరాః - కాంచీనగరానికి శ్రేష్ఠమైన శిరోమణులు, మాహేశానాః - మహేశ్వరునకు సంబంధించిన, మరకతరుచః - మాణిక్యకాంతులు (కామాక్షీ దేవి అమ్మవారు), అస్మాకీనాం - మాకు సంబంధించిన, నయన యుగళీమ్ - రెండు కన్నులను, ఫలేగ్రహీమ్ - సఫలముగా, కదాను విదధతి - ఎప్పుడు చేయునబ్బా?

38. మనసిజయశః పారంపర్యం మరన్దఝురీసువామ్
కవికులగిరాం కందం కంపానదీతటమండనమ్।
మధురలలితం మత్కం చక్షు ర్మనీషిమనోహరమ్
పురవిజయినః సర్వస్వం తత్ పురస్కురుతే కదా॥

అ॥ మనసిజ - మన్మథునియొక్క, యశః - కీర్తికి, పారంపర్యమ్ - పరంపరయు, మరందఝురీ - తేనెసోనలను, సువాం - కనునట్టి (అతిమధురమైన), కవికులగిరామ్ - కవుల వాక్కులకు, కందమ్ - మూలకందమైనట్టియు, కంపానదీ - కంపానది యొక్క, తటమండనమ్ - తీరమునకు అలంకారమైనట్టియు, మధురలలితమ్ - మిక్కిలి యందముకల్గినట్టియు, మనీషి మనోహరమ్ - విద్వాంసుల మనస్సును హరించునట్టియు, పురవిజయినః - త్రిపురములను గెల్చిన శంకరుని, తత్ సర్వస్వమ్ - ఆ సర్వస్వమును (కామాక్షీ దేవిని), మత్కంచక్షుః - నా కన్ను, కదా - ఎన్నడు, పురస్కురుతే? - ముందుంచు కొనునో!.

39. శిథిలితతమోలీలాం నీలారవిన్దవిలోచనామ్
దహనవిలసత్ఫాలాం శ్రీకామకోటి ముపాస్మహే।
కరధృతలసచ్ఛూలాం కామారిచిత్తమనోహరామ్
మనసిజ కృపాలీలాం లోలాలకా మలికేక్షణామ్॥

అ॥ శిథిలిత - సడలింపబడిన, తమోలీలామ్ - అజ్ఞాన విలసనము కల్గినట్టియు, నీలారవిన్ద - నీలమయిన కమలముల బోలు, విలోచనామ్ - కన్నులు కల్గినట్టియు, దహనవిలసత్ ఫాలామ్ - అగ్నితో ప్రకాశమానముగ నుదురు కల్గినట్టియు, కరధృత - చేతితో ధరింపబడిన, లసచ్ఛూలామ్ - ప్రకాశమానమయిన శూలము గలిగియట్టియు, కామారి - మన్మథుని శత్రువగు శివుని యొక్క, చిత్త - మనస్సునకు, మనోహరామ్ - ఆహ్లాదకారిణియైనట్టియు, మనసిజ - మన్మథుని యొక్క, కృపాలీలామ్ - కరుణావిలాసమైనట్టియు, అలికేక్షణామ్ - లలాటమందు కన్నుకలిగి నట్టియు, శ్రీ కామకోటిమ్ - కామకోటి అమ్మవారిని, ఉపాస్మహే - ఉపాసించుదుము.

40. కలాలీలాశాలా కవికులవచః కైరవవనీ
శరజ్జ్యోత్స్నాధారా శశిధరశిశుశ్లాఘ్య ముకుటీ।
పునీతే నః కమ్పాపులినతట సౌహార్దతరళా
కదా చక్షుర్మార్గం కనకగిరిధానుష్క మహిషీ॥

అ॥ కళాలీలాశాలా - కళల విలాసముల నిలయమైనట్టియు, కవికులవచః - కవులవాక్కులను, కైరవవనీ - కలువపూవులతోటలకు, శరత్జ్యోత్స్నాధారా - శరత్కాలపు వెన్నెలజల్లు అయినట్టియు, శశిధర శిశు - చంద్రకళతో, శ్లాఘ్యముకుటీ - ప్రశస్తమైన కిరీటము కల్గినట్టియు, కమ్పాపులినతట - కంపానదీ యొడ్డునందు, సౌహార్ద తరళీ - స్నేహముతో చంచలమైనట్టియు, కనకగిరి - మేరుపర్వతము, ధానుష్క - ధనస్సుగా గల శివుని, మహిషీ - పట్టమహిషి యయిన కామాక్షి, నః - మాయొక్క, చక్షుర్మార్గమ్ - కనుచూపుత్రోవను, కదా - ఎప్పుడు, పునీతే - పావనము చేయును?

**41.** నమ స్స్యాత్ నమ్రేభ్యః స్తనగరిమగర్వేణ గురుణా
దధానేభ్య శ్చూడాభరణ మమృతస్యన్ది శిశిరమ్।
సదా వాస్తవ్యేభ్యః సవిధభువి కంపాఖ్యసరితో
యశోవ్యాపారేభ్యః సుకృతవిభవేభ్యః పశుపతేః॥

అ॥ గురుణా - బరువయిన, స్తన - స్తనముల, గరిమ - గురుత్వమువలని, గర్వేణ - గర్వముతో, నమ్రేభ్యః - వంగినట్టియు, అమృతస్యన్ది - అమృతమును స్రవించునట్టి, శిశిరమ్ - చల్లనయిన, చూడాభరణమ్ - శిరోభూషయైన చంద్రకళను, దధానేభ్యః - ధరించునట్టియు, కంపాఖ్యసరితః - కంపయనుపేరుగల నది యొక్క, సవిధభువి - సమీపదేశమందు, సదా - ఎల్లపుడు, వాస్తవ్యేభ్యః - నివసించునట్టియు, యశోవ్యాపారేభ్యః - కీర్తివ్యాపృతులు గలట్టియు, పశుపతేః - శివుని యొక్క, సుకృతవిభవేభ్యః - పుణ్యాల అతిశయములకు (కామాక్షికి), నమః - నమస్కారము, స్తాత్ - అగుగాక!.

**42.** అసూయన్తీ కాచి న్మరకతరుచో నాకిముకుటీ
కదమ్బం చుమ్బన్తీ చరణనఖ చంద్రాంశుపటలైః।
తమోముద్రాం విద్రావయతు మమ కాంచీనిలయనా
హరోత్సంగ శ్రీమన్మణిగృహ మహాదీపకళికా॥

అ॥ మరకత రుచః - మాణిక్యకాంతులను (జూచి), అసూయన్తీ - అసూయపడుచు, నాకి - స్వర్గవాసులయొక్క, ముకుటీ - కిరీటముల, కదమ్బం - సమూహమును, చరణనఖ - పాదనఖము లనబరగు, చంద్ర - చంద్రులయొక్క, అంశు - కిరణముల, 'పటలైః - సమూహములతో, చుంబన్తీ - ముద్దు పెట్టుకొనుచును, కాంచీనిలయనా - కాంచీ పురమందు నెలకొన్న, హరోత్సంగ - శివుని ఒడియను, శ్రీమత్ - శ్రీమంతమయిన, మణిగృహ - మణిమంతమయిన మందిరమున, మహాదీప - గొప్పదీపము యొక్క, కళికా - మొగ్గ (జ్వాల) అయిన కామాక్షి, మమ - నా యొక్క, తమోముద్రామ్ - చీకటి యనుబంధమును, (అజ్ఞానమును) విద్రావయతు - తొలగ జేయుగాక!.

**43.** అనాద్యన్తా కాచిత్ సుజన నయనానన్ద జననీ
నిరున్ధానా కాన్తిం నిజరుచివిలాసై ర్జలముచామ్।
స్మరా రే స్తారల్యం మనసి జనయన్తీ స్వయ మహో
గలత్కంపా శంపా పరిలసతి కంపాపరిసరే॥

అ॥ అనాద్యన్తా - ఆది, అంతము, లేనట్టియు, సుజన - సత్పురుషుల, నయన - కన్నులకు, ఆనన్ద - ఆనందమును, జననీ - కలిగించునట్టియు, నిజరుచివిలాసైః - తనకాంతి విలాసములతో, జలముచామ్ - మేఘముల, కాన్తిమ్ - కాంతిని, నిరున్ధానా - అడ్డగించునట్టియు, స్మరారేః - శివుని యొక్క, మనసి - మనసునందు, స్వయమ్ - స్వయముగా, తారల్యమ్ - చంచలత్వమును, జనయన్తీ - కలిగించునట్టియు, గళత్కంపా - జారిపోయిన కంపము (ఆందోళన) కల్గినట్టియు, కాచిత్ శంపా - ఒకానొక విద్యుల్లత, కంపాపరిసరే - కంపానదీ తీరమున, పరిలసతి - విలసిల్లు చున్నది.

**44.** సుధాడిండీరశ్రీః స్మితరుచిషు తుండీరవిషయమ్
పరిష్కుర్వాణాసౌ పరిహసిత నీలోత్పలరుచిః।
స్తనాభ్యా మానమ్రా స్తబకయతు మే కాంక్షితతరుమ్
దృశా మైశానీనాం సుకృతఫల పాండిత్య గరిమా॥

అ॥ స్మితరుచిషు - చిరునవ్వు కాంతులందు, సుధాడిండీరశ్రీః - అమృతముపై నుండునుఱుగు యొక్క శోభ గల్గినట్టియు, తుండీరవిషయమ్ - తుండీరమండలమును, పరిష్కుర్వాణా - అలంకరించునట్టియు, పరివాసిత - వెక్కిరింపబడిన, నీలోత్పల - నల్ల కల్వల, రుచిః - కాంతి కల్గినట్టియు, స్తనాభ్యామ్ - స్తనములతో, ఆనమ్రా - కొంచెము వంగినట్టియు, అసౌ - ఈ, ఐశానీనాం - ఈశ్వరుని సంబంధించిన, సుకృతఫల - పుణ్యఫలమయిన, పాండిత్యగరిమా - పాండిత్యము యొక్క గౌరవము (కామాక్షి), మే - నాయొక్క, కాంక్షిత తరుమ్ - కోరికయను వృక్షమును, స్తబకయతు - పుష్పింప జేయుగాత!

**45.** కృపాధారాద్రోణీ కృపణధిషణానాం ప్రణమతామ్
నిహన్త్రీ సన్తాపం నిగమముకుటోత్తంస కలికా।
పరా కాంచీలీలాపరిచయవతీ పర్వతసుతా
గిరాం నీవీ దేవీ గిరిశపరతంత్రా విజయతే॥

అ॥ కృపా - కరుణయను, ధారా - జలధారకు, ద్రోణీ - దొన్నె అయినట్టియు, ప్రణమతామ్ - నమ్రులయినవారి యొక్క, సంతాపమ్ - సంతాపమును, నిహన్త్రీ - శమింపజేయునట్టియు, నిగమ - వేదముల, ముకుట - కిరీటములనదగు ఉపనిషత్తులకు, ఉత్తంస - శిరోభూషణమయిన, కలికా - పువ్వు మొగ్గ అయినట్టియు, కాంచీలీలా - కంచిలోని విహారముతో, పరిచయవతీ - పరిచయము గలట్టియు, పర్వతసుతా - హిమవంతుని కూతురయినట్టియు, గిరాం నీవీ - వాక్కులకు పోకముడి అయినట్టియు, పరాదేవీ - పరదేవత, గిరిశపరతంత్రా - శివుని అధీనురాలై, విజయతే - అతిశయించు చున్నది.

**46.** కవిత్వశ్రీకంద స్సుకృతపరిపాటీ హిమగిరేః
విధాత్రీ విశ్వేషాం విషమశరవీర ధ్వజపటీ।
సఖీ కంపానద్యాః పదహసితపాథోజయుగళీ
పురాణీ పాయా న్నః పురమథనసామ్రాజ్యపదవీ॥

అ॥ కవిత్వశ్రీ కందః - కవితా శోభకు మూలమయినట్టియు, హిమగిరేః - హిమవంతుని, సుకృతపరిపాటీ - పుణ్యములపరిపాకమయినట్టియు, విశ్వేషామ్ - సమస్త జగత్తులకు, విధాత్రీ - సృష్టికర్త్రి అయినట్టియు, విషమశర - అయిదుబాణములుగల మన్మథుడను, వీర - వీరుని, ధ్వజపటీ - విజయపతాక అయినట్టియు, కంపానద్యాః - కంపానదికి, పద - పాదములతో, హసిత - వెక్కిరింపబడిన, పాథోజయుగళీ - కమలముల జంట గలిగినట్టియు, పురాణీ - ప్రాచీనురాలయినట్టియు, పురమథన - త్రిపురారి అయిన శివుని, సామ్రాజ్యపదవీ - సామ్రాజ్య వైభవమనదగు కామాక్షీదేవి, నః పాయాత్ - మమ్ము కాపాడుగాక.

**47.** దరిద్రాణాం మధ్యే దరదళితతాపింఛసుషమాః
స్తనాభోగక్లాన్తాః తరుణహరిణాంకాంకిత కచాః।
హరాధీనా నానావిబుధముకుటీచుంబితపదాః
కదా కంపాతీరే కథయ విహరామో గిరిసుతే॥

అ॥ గిరిసుతే - హిమవంతుని కూతురయిన పార్వతీ, దరిద్రాణాం మధ్యే - దరిద్రులమధ్యలో అనగా లేమి అనదగిన ఖాళీ ప్రదేశముబోలు సన్నని నడుమున, దరదళిత - కొంచెము వికసించిన, తాపింఛ - కానుగ చెట్టు చివురుటాకు యొక్క, సుషమాః - శోభ కలిగిన వారమై, స్తనాభోగ - విస్తృతమైన స్తనములచేత, క్లాన్తాః - శ్రమపడునట్టి వారమై, తరుణ - లేత, హరిణాంక - చంద్రుడు, అంకిత - చిహ్నముగాగల, కచాః - కేశపాశము కల్గినవారమై, నానావిబుధ - అనేక దేవతల, ముకుటీ - కిరీటములతో, చుంబితపదాః - ముద్దుపెట్టుకోబడిన పాదములు గల్గిన వారమై, హరాధీనాః - శివునిపై అధీనులమై, కంపాతీరే - కంపానదీ తటమున, కదా - ఎప్పుడు, విహరామః - విహరించుదుము!
(కామాక్షీ సారూప్యమిచట చెప్పబడినది)

**48.** వరీవర్తు స్థేమా త్వయి మమ గిరాం దేవి మనసో
నరీనర్తు ప్రౌఢా వదనకమలే వాక్యలహరీ।
చరీచర్తు ప్రజ్ఞాజనని జడిమా నః పరజనే
సరీసర్తు స్వైరం జనని మయి కామాక్షి కరుణా॥

అ॥ జనని - తల్లీ!, కామాక్షి - ఓ కామాక్షీ!, ప్రజ్ఞాజనని - ప్రజ్ఞకు మూలకారణమగు తల్లీ!, దేవి - ఓ దేవీ, మమ - నాయొక్క, గిరామ్ - వాక్కుల, స్థేమా - నిలకడ, త్వయి - నీయందు, వరీవర్తు - మిక్కిలి ప్రవర్తించు గాత!, మనసః - మనస్సు యొక్క, స్థేమా - నిలకడ, త్వయి - నీయందు, వరీవర్తు - మిక్కిలి ప్రవర్తించుగాత!, వదనకమలే - ముఖకమల మందు, ప్రౌఢా - ప్రౌఢమయిన, వాక్యలహరీ - వాక్కులప్రవాహము, నరీనర్తు - బాగుగా నృత్యము చేయుగాక!, నః - మాయొక్క, పరజనే - శత్రువునందు, జడిమా - జడత్వము, చరీచర్తు - బాగుగా చరించుగాత!, మయి - నా యందు, కరుణా - దయ, స్వైరమ్ - స్వేచ్ఛగా (పూర్తిగా), సరీసర్తు - బాగుగా ప్రసరించుగాత!.

49. క్షణాత్తే కామాక్షి భ్రమరసుషమాశిక్షణగురుః
కటాక్షవ్యాక్షేపో మమ భవతు మోక్షాయ విపదామ్।
నరీనర్తు స్వైరం వచనలహరీ నిర్జరపురీ
సరిద్వీచీ నీచీకరణపటు రాస్యే మమ సదా॥

అ॥ హే కామాక్షి - ఓ కామాక్షి, భ్రమర - తుమ్మెదలయొక్క, సుషమా - శోభకు, శిక్షణగురుః - శిక్షణ మిచ్చుటలో గురువయిన, తే - నీ యొక్క, కటాక్షవ్యాక్షేపః - క్రీగంటి ప్రసారము, క్షణాత్ - వెంటనే, మమ - నా యొక్క, విపదామ్ - ఆపదల, మోక్షాయ - విముక్తికై, భవతు - అగుగాక, వచనలహరీ - వాక్కులప్రవాహము, నిర్జరపురీ - దేవతా పురములోని, సరిత్ - నది (గంగ) యొక్క, వీచీ - అలలను, నీచీకరణ - తక్కువ చేయుట యందు, పటుః - సమర్థమై, మమ - నా యొక్క, ఆస్యే - ముఖమందు, సదా - ఎల్లపుడు, స్వైరమ్ - స్వేచ్ఛగా (పూర్తిగా), నరీనర్తు - మిక్కిలి నర్తించు గాత!

50. పురస్తా న్మే భూయః ప్రశమన పరః స్తాన్మమ రుజామ్
ప్రచారస్తే కమ్పాతటవిహృతిసమ్పాదిని దృశోః।
ఇమాం యాచ్నా మూరీకురు సపది దూరీకురు తమః
పరీపాకం మత్కం సపది బుధలోకం చ నయ మామ్॥

అ॥ కమ్పాతటి - కంపానదీ తీరమందు, విహృతి - విహారమును, సమ్పాదిని - సంపాదన చేయు కామాక్షీ దేవీ!, తే - నీయొక్క, దృశోః - చూపులయొక్క, ప్రచారః - ప్రసరణము, మే - నాయొక్క, పురస్తాత్ - ముందట, భూయః - మఱల మఱల, మమ రుజామ్ - నా రోగముల, ప్రశమనపరః - శమించుటయందు తత్పరముగా, స్తాత్ - అగుగాక!, ఇమాం యాచ్నామ్ - ఈ యాచనను, ఊరీకురు - అంగీకరించుము, సపది - వెంటనే, మత్కం - నాది అయిన, తమఃపరీపాకమ్ - అజ్ఞానపరిణామమును, దూరీకురు - దూరముచేయుము, సపది - వెంటనే, మాం చ - నన్ను గూడ, బుధలోకం నయ - పండితులలోకమును చేరనీయుము.

51. ఉదంచన్తీ కాంచీనగరనిలయే త్వత్కరుణయా
సమృద్ధా వాగ్ధాటీ పరిహసితమాధ్వీ కవయతామ్।
ఉపాదత్తే మారప్రతిభట జటాజూటముకుటీ
కుటీరోల్లాసిన్యాః శతమఖతటిన్యా జయపటీమ్॥

అ॥ కాంచీగరనిలయే - కాంచీనగరనివాసినీ, కామాక్షీ!, త్వత్కరుణయా - నీ కరుణతో, కవయతామ్ - కవులకు, ఉదంచన్తీ - ఉద్యుక్తమైన, సమృద్ధా - సమృద్ధమయిన, వాగ్ధాటీ - వాక్కుల ధోరణి, పరిహసితమాధ్వీ - వెక్కిరింపబడిన తేనె కలదై, మారప్రతిభట - మన్మథవైరియగు శంకరుని యొక్క, జటాజూట - జటాజూటమను: ముకుటీ - కిరీటమే (కిరీటముబోలు జటా జూటమను), కుటీర - కుటీరమందు, ఉల్లాసిన్యాః -విలసించు, శతమఖతటిన్యాః - వియద్గంగ యొక్క, జయపటీమ్ - జయపతాకను, ఉపాదత్తే - స్వీకరించుచున్నది.

52. శ్రియం విద్యాం దద్యా జ్జనని సమతాం కీర్తి మమితామ్
సుపుత్రం ప్రాదత్తే తవ ఝటితి కామాక్షి కరుణా।
త్రిలోక్యా మాధిక్యం త్రిపురపరిపన్థిప్రణయిని
ప్రణామ స్త్వత్పాదే శమిత దురితే కిం న కురుతే॥

అ॥ జనని - తల్లీ, కామాక్షి - ఓ కామాక్షీ!, తవ - నీ యొక్క, కరుణా - దయ, ఝటితి - వెంటనే, శ్రియమ్ - సంపదను, విద్యామ్ - విద్యను, దద్యాత్ - ఇచ్చును, సమతాం - సమత్వమును, అమితాం - అమితమయిన, కీర్తిమ్ - కీర్తిని, దద్యాత్ - ఇచ్చును, సుపుత్రమ్ - సత్పుత్రుని, ప్రాదత్తే - దానముచేయును, త్రిపుర పరిపన్థి ప్రణయిని - త్రిపురారి ప్రియురాలా, త్రిలోక్యామ్ - ముల్లోకములందు, ఆధిక్యమ్ - గొప్పదనమును, ప్రాదత్తే - ఇచ్చును. శమితదురితే - శమింపజేయబడిన పాపముగలదానా, త్వత్పాదే - నీపాదమున, ప్రణామః - ప్రణామము, కిం న కురుతే - ఏమి చేయదు?.

53. మనస్స్తంభం స్తంభం గమయ దుపకమ్పం ప్రణమతామ్
సదాలోకం నీలం చికురజితరోలంబనికరమ్।
గిరాం. దూరం స్మేరం ధృతశశికిశోరం పశుపతేః
దృశాం భోగ్యం యోగ్యం తుహినగిరిభాగ్యం విజయతే॥

అ॥ ప్రణమతామ్ - నమస్కరించువారికి, మనస్స్తంభం - మనోగర్వమును, స్తంభం గమయత్ - స్తంభింపజేయుచు, సదాలోకమ్ - సజ్జనులకు వెల్తు రు అయినట్టియు, నీలమ్ - నీలముగా నున్నట్టియు, చికుర జిత - ముంగురులచే గెల్వబడిన, రోలంబనికరమ్ - తుమ్మెదల గుంపు కలిగినట్టియు, గిరాం దూరమ్ - వాక్కులకు దూరమైనట్టియు, స్మేరమ్ - చిరునవ్వుతో కూడినట్టియు, ధృతశశికిశోరమ్ - ధరింపబడిన చంద్రకళ గలిగినట్టియు, పశుపతేః - శివుని యొక్క, దృశాం - కన్నులకు, భోగ్యమ్ - భోగమయిన, యోగ్యమ్ - యోగ్యమైన, తుహినగిరిభాగ్యమ్ - హిమవంతుని భాగ్యము, ఉపకంపమ్ - కంపానదీ తీరమున, విజయతే - విలసిల్లు చున్నది.

54. ఘనశ్యామాన్ కామాంతకమహిషి కామాక్షి మధురామ్
దృశాం పాతా నేతా నమృత జలశీతా ననుపమాన్।
భవోత్పాతే భీతే మయి వితర నాథే దృఢ భవ
న్మనశ్శోకే మూకే హిమగిరిపతాకే కరుణయా॥

అ॥ కామాంతక - మన్మథుని అంతము చేయు శివుని, మహిషి - పట్టమహిషి అయిన, కామాక్షి - ఓ కామాక్షీ!, హిమగిరి పతాకే - హిమవంతుని విజయపతాకా, హే నాథే - ఓ సంరక్షకురాలా, భవోత్పాతే - సంసారమను విపత్తునందు, భీతే - భయపడినట్టియు, దృఢభవన్ - దృఢపడుచున్న, మనశ్శోకే - మనశ్శోకము గలట్టియు, మూకే - మూగవాడనయిన, మయి - నా యందు, కరుణయా - దయతో, ఘనశ్యామాన్ - మేఘములవలె నీల మయినట్టియు, మధురాన్ - తీయదనము గల్గినట్టియు, అమృత జలశీతాన్ - అమృత జలమువలె చల్లనైనట్టియు, అనుపమాన్ - సాటిలేనట్టియు, ఏతాన్ - ఈ, దృశాం పాతాన్ - చూపుల నిపాతములను, వితర - సమర్పణ చేయుము.

55. నతానాం మన్దానాం భవనిగళ బంధాకులధియామ్
సదాన్ధ్యం రుంధానా మభిలషితసన్తానలతికామ్।
చరన్తీం కమ్పాయా స్తటభువి సవిత్రీం త్రిజగతామ్
స్మరామ స్తాం నిత్యం స్మరమథనజీవాతుకలికామ్॥

అ॥ భవనిగళ బంధ - సంసార పాశబంధముచే, ఆకుల - వ్యాకులమయిన, ధియామ్ - బుద్ధి గలిగినట్టియు, మన్దానామ్ - జడులయినట్టియు, నతానామ్ - నమ్రులయినవారికి, సదా - ఎల్లపుడు, ఆంధ్యం - చీకటిని (జ్ఞానమును), రున్ధానామ్ - అడ్డగించునట్టియు, అభిలషిత - కోరినవానిని (ప్రసాదించు), సన్తాన లతికామ్ - సంతానలత అయినట్టియు, కమ్పాయాః - కంపానది యొక్క, తటభువి - తీరప్రాంతమున, త్రిజగతామ్ - ముల్లోకములకు, సవిత్రీమ్ - తల్లి అయినట్టియు, స్మరమథన - మన్మథుని మథించు శివుని, జీవాతు - జీవనాధారమయిన, కలికామ్ - మొగ్గయనదగు, తామ్ - ఆ కామాక్షిని, నిత్యమ్ - ఎల్లప్పుడు, స్మరామః - స్మరించెదము.

56. పరా విద్యా హృద్యా శ్రితమదనవిద్యా మరకత
ప్రభానీలా లీలా పరవశిత శూలాయుధమనాః।
తమః పూరం దూరం చరణనతపౌరన్దరపురీ
మృగాక్షీ కామాక్షీ కమలతరలాక్షీ నయతు మే॥

అ॥ హృద్యా - మనోహరమయిన, పరావిద్యా - పరా విద్యా రూపిణియును, శ్రిత - ఆశ్రయింపబడిన, మదన విద్యా - మన్మథకళ కలిగినట్టియు, మరకత - మాణిక్యముల, ప్రభా - కాంతివలె, నీలా - నీలమయినట్టియు, లీలా - లీలచే (సునాయాసముగా), పరవశిత - పరవశీకృతమైన, శూలాయుధ - త్రిశూలమాయుధముగల శివుని, మనాః - మానసము కలిగినట్టియు, చరణనత - పాదాలపై నమస్కరించిన, పౌరందరపురీ - స్వర్గలోకమందలి, మృగాక్షీ - స్త్రీలు అనగా అప్సరసలు గలట్టియు, కమలతరలాక్షీ - కమలములవలె చంచలమైన కన్నులు గల, కామాక్షీ - కామాక్షీ దేవి, మే - నాయొక్క, తమః పూరం - చీకటి ప్రవాహమును (అజ్ఞానమును) దూరం నయతు - దూరముచే కొని పోవుగాక!

57. అహంతాఖ్యా మత్కం కబలయతి ఖ్యా హన్త హరిణీ
హఠా త్సంవిద్రూపం హరమహిషి సస్యాంకుర మసౌ।
కటాక్షవ్యాక్షేప ప్రకటహరిపాషాణ పటలైః
ఇమా ముచ్చై రుచ్చాటయ ఝటితి కామాక్షి కృపయా॥

అ॥ హరమహిషి - శివుని పట్టమహిషి అయిన, కామాక్షి - కామాక్షీదేవీ, అసౌ - ఈ, అహంతాఖ్యా - అహంకారమను, హరిణీ - ఆడుజింక, మత్కమ్ - నాదయిన, సంవిద్రూపమ్ - జ్ఞానరూపయిన, సస్యాంకురమ్ - పంట చిగుళ్లను, హఠాత్ - హఠాత్తుగ, కబలయతి - మ్రింగుచున్నది, హన్త - అయ్యో!, కటాక్ష - క్రీగంటి చూపుల, వ్యాక్షేప - ప్రసారముల నబరగు, ప్రకట - స్పష్టమయిన, హరిపాషాణ - ఇంద్రనీలముల, పటలైః - కుప్పలతో, కృపయా - దయతో, ఇమామ్ - దీనిని (అహంకారమును), ఉచ్చైః - బిగ్గరగా, ఝటితి - త్వరగా, ఉచ్చాటయ - తోలి వేయుము.

58. బుధే వా మూకే వా తవ పతతి యస్మిన్ క్షణ మసౌ
కటాక్షః కామాక్షి ప్రకటజడిమక్షోదపటిమా।
కథంకారం నాస్మై కరముకులచూడాలముకుటా
నమోవాకం బ్రూయుః నముచిపరిపన్థిప్రభృతయః॥

అ॥ కామాక్షి - ఓకామాక్షీ!, ప్రకట - స్పష్టమయిన, జడిమ - జడత్వమును, క్షోద - చూర్ణముచేయుట యందు, పటిమా - పాటవముగల, అసౌ - ఈ, తవ - నీ యొక్క, కటాక్షః - క్రీగంటిచూపు, యస్మిన్ - ఏ, బుధేవా - పండితునియందుగాని, మూకేవా - మూగవాని యందుగాని, క్షణంపతతి - క్షణకాలము పడునో, నముచిపరిపన్థి - నముచి శత్రువగు నింద్రుడు, ప్రభృతయః - మున్నుగా గలదేవతలు, కరముకుల - ముకుళించిన కరములు, చూడాల - శిరసున కలంకారమయిన, ముకుటాః - కిరీటములుగలవారై, అస్మై - ఇతనికి, కథంకారమ్ - ఎట్లు?, నమోవాకమ్ - నమస్కారమును, నబ్రూయుః - పలుకకుందురు?.

59. ప్రతీచీం పశ్యామః ప్రకటరుచినీవారకణిక
ప్రభాసధ్రీచీనాం ప్రదళితషడాధారకమలామ్।
చరన్తీం సౌషుమ్నే పథి పరపదేన్దు ప్రవిగళ
త్సుధార్ద్రాం, కామాక్షీం పరిణతపరజ్యోతిరుదయామ్॥

అ॥ ప్రకటరుచి - ప్రకటమయిన కాంతిగల, నీవారకణిక - నీవారశూకముయొక్క, ప్రభా - ప్రభతో, సధ్రీచీనామ్ - సమానమయినట్టియు, ప్రదళిత - విచ్చునట్లు చేయబడిన, షడాధారకమలామ్ - ఆరుకమలములుగలట్టి, ప్రతీచీమ్ - నివృత్తి మార్గమందున్న, కామాక్షీమ్ - కామాక్షిని, సౌషుమ్నేపథి - సుషుమ్నామార్గమున, చరన్తీమ్ - సంచరించుచు, పరపదేన్దు - పరమపదమందు చంద్రుని నుండి, ప్రవిగలత్ - స్రవించుచున్న, సుధార్ద్రామ్ - అమృతముతో తడిసినదానిగా, పరిణత - పరిపాకము జెందిన, పరజ్యోతిరుదయామ్ - పరంజ్యోతి ప్రత్యుదయముగా, పశ్యామః - తెలిసికొనుచున్నాము.

60. జంభారాతిప్రభృతిముకుటీః పాదయోః పీఠయన్తీ
గుంఫాన్వాచాం కవిజనకృతాన్ స్వైర మారామయన్తీ।
శంపాలక్ష్మీం మణిగణరుచాం పాటలైః ప్రాపయన్తీ
కంపాతీరే కవిపరిషదాం జృంభతే భాగ్యసీమా॥

అ॥ జంభారాతి - ఇంద్రుడు, ప్రభృతి - మొదలగువారి, ముకుటీః - కిరీటముల, పాదయోః - పాదములకు, పీఠయన్తీ - పీఠముగా చేసి కొనుచున్నదై, కవిజనవృతాన్ - కవులచే రచితములయిన, వాచాం గుంఫాన్ - వాక్కుల సమూహములను, స్వైరమ్ - స్వేచ్ఛగా, ఆరామయన్తీ - పూలదోటగా చేసికొనుచున్నదై, మణిగణరుచామ్ - మణిగణ కాంతుల, పాటలైః - పాటలములచే (శ్వేతరక్తమిశ్ర వర్ణములతో), శంపాలక్ష్మీమ్ - విద్యుత్‌శోభను, ప్రాపయన్తీ - పొందింపజేయుచున్నదై, కవిపరిషదామ్ - కవిబృందముల, భాగ్యసీమా - భాగ్యముల రేఖ, కంపాతీరే - కంపానదీ తటమున, జృంభతే - విలసిల్లుచున్నది.

61. చంద్రాపీడాం చతురవదనాం చంచలాపాంగలీలామ్
కున్దస్మేరాం కుచభరనతాం కున్తలోద్ధూతభృంగామ్।
మారారాతే ర్మదనశిఖినం మాంసలం దీపయన్తీమ్
కామాక్షీం తాం కవికులగిరాం కల్పవల్లీ ముపాసే॥

అ॥ చంద్రాపీడామ్ - చంద్రుడు శిరోభూషగా గల్గినట్టియు, చతురవదనామ్ - అందమైన ముఖము కల్గినట్టియు, చంచలాపాంగలీలామ్ - చంచలమైన క్రీగంటి ప్రసారముగలట్టియు, కున్దస్మేరామ్ - మల్లెపూవువంటి చిరునగవు కలిగినట్టియు, కుచభరనతామ్ - స్తనభారముతో వంగినట్టియు, కుంతల - ముంగురులచే, ఉద్ధూత - తరిమివేయబడిన, భృంగామ్ - తుమ్మెదలు కలిగినట్టియు, మారారాతేః - మదన వైరియగు శివుని, మదన శిఖినమ్ - మన్మథాగ్నిని, మాంసలమ్ - అధికముగా (బలముగా), దీపయన్తీమ్ - ప్రజ్వలింప జేయునట్టియు, కవికులగిరామ్ - కవిజనులవాక్కులకు, కల్పవల్లీమ్ - కల్పలతగా నున్నట్టియు, తాం కామాక్షీమ్ - ఆ కామాక్షిని, ఉపాసే - ఉపాసించుచున్నాను.

62. కాలాంభోదప్రకరసుషమాం కాన్తిభి స్తర్జయన్తీ
కల్యాణానా ముదయసరణిః కల్పవల్లీ కవీనామ్।
కందర్పారేః ప్రియసహచరీ కల్మషాణాం నిహన్త్రీ
కాంచీదేశం తిలకయతి సా కాపి కారుణ్యసీమా॥

అ॥కాలాంభోద - నీలమేఘముల, ప్రకర - సమూహముల, సుషమామ్ - శోభను, కాన్తిభిః - కాంతులతో, తర్జయన్తీమ్ - భయపెట్టుచున్నట్టియు, కల్యాణానామ్ - మంగళములకు, ఉదయసరణిః - ఉదయపుత్రోవ అయినట్టియు, కవీనామ్ - కవులకు, కల్పవల్లీ - కల్పలత అయినట్టియు, కందర్పారేః - మదనుని శత్రువయిన శివునకు, ప్రియ సహచరీ - ప్రియసహధర్మచారిణియు, కల్మషాణాం నిహన్త్రీ - పాపముల సంహారకారిణియునగు, కాపి - ఒకానొక, సా కారుణ్యసీమా - ఆ దయాపరిధి, కాంచీదేశమ్ - కంచి ప్రాంతమును, తిలకయతి - అలంకరించుచున్నది.

63. ఊరీకుర్వ న్నురసిజతటే చాతురీం భూధరాణామ్
పాథోజానాం నయనయుగళే పారిపంథ్యం వితన్వన్।
కంపాతీరే విహరతి రుచా మోఘయన్ మేఘశైలీమ్
కోకద్వేషం శిరసి కలయన్ కో2పి విద్యావిశేషః॥

అ॥ ఉరసిజతటే - స్తనతటమందు, భూధరాణామ్ - పర్వతముల, చాతురీమ్ - చాతుర్యమును, ఊరీకుర్వన్ - అంగీకరించుచు, పాథోజానామ్ - కమలముల యొక్క, పారిపంథ్యమ్ - శత్రుత్వమును, నయనయుగళే - రెండు కన్నుల యందు, వితన్వన్ - విస్తరించుచు, కోకద్వేషమ్ - చక్రవాకపక్షులద్వేషమును (చంద్రకళను), సిరసి - శిరస్సుమీద, కలయన్ - ధరించుచు, రుచా - శరీరకాంతితో, మేఘశైలీమ్ - మేఘములశైలిని, మోఘయన్ - వ్యర్థము చేయుచు, కో2పి - ఒకానొక, విద్యా విశేషః - విద్యావిశేషము, కంపాతీరే - కంపానదీ తీరమున, విహరతి - విహరించుచున్నది.

64. కాంచీలీలాపరిచయవతీ కాపి తాపింఛలక్ష్మీః
జాడ్యారణ్యే హుతవహశిఖా జన్మభూమిః కృపాయాః।
మాకందశ్రీ ర్మధురకవితాచాతురీకోకిలానామ్
మార్గే భూయా న్మమ నయనయోః మాన్మథీ కాపి విద్యా॥

అ॥ కాంచీలీలా - కంచినగరవిహారమున, పరిచయవతీ - పరిచయము కలిగినట్టి, కాపి - ఒకానొక, తాపించలక్ష్మీః - కానుగ చెట్టుశోభయైనట్టియు, జాడ్యారణ్యే - జడత్వమను అరణ్యమునకు, హుతవహశిఖా - అగ్నిశిఖ అయినట్టియు, కృపాయాః - జాలికి, జన్మభూమిః - జన్మభూమి అయినట్టియు, మధుర కవితా - మధుర కవితలయొక్క, చాతురీ - చతురత్వమను, కోకిలానామ్ - కోయిలలకు, మాకందశ్రీః - మామిడి చెట్లశోభయునగు, మాన్మథీ - మన్మథునకు సంబంధమయిన, కాపి విద్యా - ఒకానొకవిద్య, మమ - నా, నయనయోః - కన్నులయొక్క, మార్గే - మార్గమందు, భూయాత్ - ఉండుగాక!

65. సేతు ర్మాత ర్మరకతమయో భక్తి భాజాం భవాబ్ధౌ
లీలాలోలా కువలయమయీ మాన్మథీ వైజయన్తీ।
కాంచీభూషా పశుపతిదృశాం కాపి కాలాంజనాలీ
మత్కం దుఃఖం శిథిలయతు తే మంజులాపాంగమాలా॥

అ॥ హే మాతః - ఓ తల్లీ, భక్తి భాజామ్ - భక్తి గలవారికి, భవాబ్ధౌ - సంసారసాగరాన, మరకతమయః - మాణిక్యనిర్మితమైన, సేతుః - సేతువయినట్టియు, కువలయమయీ - కల్వపూలతో చేయబడిన, లీలాలోలా - విలాసపరాయణమైన, మాన్మథీ వైజయన్తీ - మన్మథ విజయపతాక యైనట్టియు, పశుపతి దృశామ్ - శివుని చూపులకు, కాపి - ఒకానొక, కాలాంజనాలీ - నల్లని కాటుకవరుస కల్గినట్టి, తే - నీ యొక్క, మంజుల - అందమయిన, అపాంగమాలా - కటాక్షములవరుస, మత్కం - నా సంబంధమైన, దుఃఖమ్ - దుఃఖమును, శిథిలయతు - సడలించుగాత!

66. వ్యావృణ్వానాః కువలయదల ప్రక్రియావైరముద్రామ్
వ్యాకుర్వాణా మనసిజమహారాజ సామ్రాజ్యలక్ష్మీమ్।
కాంచీలీలావిహృతిరసికే కాంక్షితం నః క్రియాసుః
బంధచ్ఛేదే తవ నియమినాం బద్ధదీక్షాః కటాక్షాః॥

అ॥ కాంచీలీలావిహృతిరసికే - కాంచీపురమందు విహరించుటయందు రసికురాలా, కువలయదల - కల్వపూవుదళముల, ప్రక్రియా - ప్రకారములకు, వైరముద్రామ్ - విరోధమును, వ్యావృణ్వానాః - వివరించునవియై, మనసిజ - మన్మథుడను, మహారాజ - మహారాజు యొక్క, సామ్రాజ్యలక్ష్మీమ్ - సామ్రాజ్యలక్ష్మిని, వ్యాకుర్వాణాః - వ్యాఖ్యానించుచున్నవియై, నియమినామ్ - తపస్వులయొక్క, బంధచ్ఛేదే - సంసారబంధనాశమునందు, బద్ధదీక్షాః - దీక్షాబద్ధములయిన, తవ - నీయొక్క, కటాక్షాః - క్రీగంటి చూపులు, నః - మాయొక్క, కాంక్షితమ్ - కోరికను, క్రియాసుః - నెరవేర్చుగాక!

67. కాలాంభోదే శశిరుచి దలం కైతకం దర్శయన్తీ
మధ్యేసౌదామిని మధులిహాం మాలికాం రాజయన్తీ।
హంసారావం వికచకమలే మంజు ముల్లాసయన్తీ
కంపాతీరే విలసతి నవా కాపి కారుణ్యలక్ష్మీః॥

అ॥ కాలాంభోదే - నల్లని మబ్బునందు (కేశపాశమందు), శశిరుచి దలమ్ - చంద్రుని కాంతిగల, కైతకం దలమ్ - మొగలిరేకును, దర్శయన్తీ - చూపించుచు, మధ్యేసౌదామిని - మెఱుపు తీగమధ్యన (నడుమునందు), మధులిహాం - తుమ్మెదల యొక్క, మాలికామ్ - వరుసను (నూగారును), రాజయన్తీ - ప్రకాశింప జేయుచు, వికచకమలే - వికసించిన పద్మమందు (ముఖమందు), మంజుమ్ - మనోహరమయిన, హంసారావమ్ - హంసధ్వనిని, ఉల్లాసయన్తీ - ఉల్లసింపజేయుచు, కంపాతీరే - కంపానదీ తటమున, నవా - నవీనమయిన, కాపి - ఒకానొక, కారుణ్యలక్ష్మీః - కరుణా లక్ష్మి (దయాసాంద్రత), విలసతి - విలసిల్లుచున్నది.

68. చిత్రం చిత్రం నిజమృదుతయా భర్త్సయన్ పల్లవాలీమ్
పుంసాం కామాన్ భువి చ నియతం పూరయన్ పుణ్యభాజామ్।
జాత శ్శైలా న్నతు జలనిధేః స్వైరసంచారశీలః
కాంచీభూషా కలయతు శివం కోఽపి చింతామణి ర్మే॥

అ॥ చిత్రమ్ చిత్రమ్ - ఆశ్చర్యము! ఆశ్చర్యము!, నిజమృదుతయా - తనమార్దవముతో, పల్లవాలీమ్ - చిగురుటాకులవరుసను, భర్త్సయన్ - భయపెట్టుచు, భువి - భూమి పై, పుణ్యభాజామ్ - పుణ్యవంతులయిన, పుంసామ్ - పురుషులయొక్క, కామాన్ - కోరికలను, నియతమ్ - తప్పక, పూరయంశ్చ - పూరించుచును, శైలాత్ - పర్వతము నుండి, జాతః - పుట్టినట్టియు, జలనిధేః - సముద్రము నుండి మాత్రము, న జాతః - జనించనట్టియు, స్వైర - స్వేచ్ఛగా, సంచారశీలః - సంచరించు స్వభావవముగలట్టియు, కాంచీభూషా - కంచికి అలంకారమయిన, కోఽపి - ఒకానొక, చింతామణిః - చింతామణి, మే - నాకు, శివం - మంగళమును, కలయతు - చింతించుగాక!.

69. తామ్రాంభోజం జలదనికటే తత్ర బంధూకపుష్పమ్
తస్మిన్ మల్లీకుసుమసుషమాం తత్ర వీణానినాదమ్।
వ్యావృణ్వానా సుకృతలహరీ కాపి కాంచీనగర్యా
మైశానీ సా కలయతితరా మైంద్రజాలం విలాసమ్॥

అ॥ జలదనికటే - మేఘసమీపమున (కేశపాశప్రాంతమున), తామ్రాంభోజమ్ - ఎఱ్ఱని కమలమును, తత్ర - అక్కడ, బంధూకపుష్పమ్ - మంకెనపువ్వును (క్రిందిపెదవిని), తస్మిన్ - దానియందు, మల్లీకుసుమ - మల్లెపూల, సుషమామ్ - శోభను (చిరునవ్వును),వీణానినాదమ్ - వీణానాదమును (మధురకంఠధ్వనిని), వ్యావృణ్వానా - వివరించుచు, కాపి - ఒకానొక, ఐశానీ - శివునకు సంబంధించిన, సుకృతలహరీ - పుణ్యప్రవాహము, కాంచీనగర్యామ్ - కాంచీపత్తన మందు, ఇంద్రజాలం విలాసమ్ - ఇంద్రజాలపు విలాసమును, కలయతితరామ్ - విశేషముగా జూపు చున్నది.

70. ఆహారాంశం త్రిదశసదసా మాశ్రయే చాతకానా
మాకాశోపర్యపి చ కలయన్ ఆలయం తుంగమేషాం।
కమ్పాతీరే విహరతితరాం కామధేనుః కవీనామ్
మన్దస్మేరో మదననిగమప్రక్రియా సంప్రదాయః॥

అ॥ చాతకానామ్ - చాతక పక్షులకు, ఆశ్రయే - ఆశ్రయమైన మబ్బులందు (కేశపాశమున), త్రిదశసదసామ్ - దేవసభలకు, ఆహారాంశమ్ - ఆహారమైన అమృతభాగమును ( చంద్రకళను), కలయన్ - ధరించుచు, ఆకాశోపర్యపి చ - ఆకాశముపైనను, ఏషామ్ - ఈ చాతకములకు (కేశములకు), తుంగమ్ - ఎత్తయిన, ఆలయమ్ - స్థానమును (నడుముపై స్తన భారమును), కలయన్ - వహించుచు, కవీనామ్ - కవులకు, కామధేనుః - కామధేనువు అయినట్టి, మందస్మేరః - కొంచెం చిరునగవుగల, మదన - మన్మథుని యొక్క, నిగమ ప్రక్రియా - శాస్త్ర ప్రకారము యొక్క, సంప్రదాయః - గురుశిష్య పరంపర, కంపాతీరే - కంపానదీ తటమున, విహరతితరామ్ - మిక్కిలిగా విహరించుచున్నది.

71. ఆర్ద్రీభూతై రవిరలకృపై రాత్తలీలావిలాసైః
ఆస్థాపూర్ణై రధికచపలై రంచితాంభోజశిల్పైః।
కాంతై ర్లక్ష్మీ లలితభవనైః కాన్తి కైవల్యసారైః
కాశ్మల్యం నః కబలయతు సా కామకోటీ కటాక్షైః॥

అ॥ ఆర్ద్రీభూతైః - ఆర్ద్రములయినట్టియు, అవిరలకృపైః - ఎడతెగని దయగలిగినట్టియు, ఆత్తలీలావిలాసైః - పొందబడినలీలా విలాసములు గలిగి నట్టియు, ఆస్థాపూర్ణైః - ఆశతో నిండినట్టియు, అధిక చపలైః - మిక్కిలి చంచలములైనట్టియు, అంచితాంభోజశిల్పైః - ఒప్పిదమైన పద్మముల శిల్పకళ కల్గినట్టియు, కాంతైః - మనోహరములయినట్టియు, లక్ష్మీ లలిత భవనైః - లక్ష్మికి అందమగు భవంతులయినట్టియు, కాన్తి - కాంతియను, కైవల్య - కైవల్యమునకు, సారైః - సారభూతములయినట్టియు, కటాక్షైః - కటాక్షములతో, సా - ఆ, కామకోటీ - కామాక్షి, నః - మాయొక్క, కాశ్మల్యమ్ - కలుషమును, కబలయతు - గ్రసించునుగాత!

72. ఆధున్వత్యై తరలనయనై రాంగజీం వైజయన్తీమ్
ఆనందిన్యై నిజపదజుషా మాత్త కాంచీపురాయై।
అస్మాకీనం హృదయ మఖిలై రాగమానాం ప్రపంచైః
ఆరాధ్యాయై స్పృహయతితరా మాదిమాయై జనన్యై॥ స్పృహ

అ॥ తరలనయనైః - చంచలమగు కనులతో, ఆంగజీమ్ - మన్మథునిదైన, వైజయన్తీమ్ - పతాకను (మత్స్యమును), ఆధున్వత్యై - తూలజేయునట్టియు, నిజపదజుషామ్ - తనపదములను చేరినవారిని, ఆనందిన్యై - ఆనందింప జేయునట్టియు, ఆత్తకాంచీపురాయై - ఆశ్రయింపబడిన కాంచీ పురము గలిగినట్టియు, అఖిలైః - సమస్తములైన, ఆగమానాం ప్రపంచైః - వేదముల సందోహములచే, ఆరాధ్యాయై - ఆరాధన చేయదగిన, ఆదిమాయై జనన్యై - ఆదిమాత కొఱకు, అస్మాకీనం - మాకు సంబంధించిన, హృదయమ్ - హృదయము, స్పృహయతితరామ్ - మిక్కిలి ఆశపడుచున్నది. స్పృహ

73. దూరం వాచాం త్రిదశసదసాం దుఃఖసిన్ధో స్తరిత్రమ్
మోహక్ష్వేల క్షితిరుహవనే తీక్ష్ణధారం కుఠారమ్।
కంపాతీరే ప్రణయి కవిభిః వర్ణితోద్యచ్చరిత్రమ్
శాంత్యై సేవే సకలవిపదాం శాంకరం తత్కళత్రమ్॥

అ॥ త్రిదశసదసామ్ - దేవతాసదస్సుల యొక్క, వాచామ్ - వాక్కులకు, దూరమ్ - దూరమయినట్టియు, దుఃఖసిన్ధోః - దుఃఖమను సముద్రమునకు, తరిత్రమ్ - నావయైనట్టియు, మోహక్ష్వేల - అజ్ఞానమను విషముతో కూడిన, క్షితిరుహవనే - చెట్లతోపునందు, తీక్ష్ణధారం - పదునైనధారగల, కుఠారమ్ - గొడ్డలి యైనట్టియు, కంపాతీరే - కంపానదీ తటమున, ప్రణయికవిభిః - ప్రేమగలకవులచే, వర్ణిత - వర్ణింపబడిన, ఉద్యత్ - ఉల్లసితమయిన, చరిత్రమ్ - చరిత్ర కలిగినట్టియు, శాంకరమ్ - శంకరుని సంబంధించిన, తత్ కళత్రమ్ - ఆ భార్యను, శాంత్యై - శాంతి కోసము, సేవే - సేవించెదను.

74. ఖండీకృత్య ప్రకృతికుటిలం కల్మషం ప్రాతిభ శ్రీ
శుండీరత్వం నిజపదజుషాం శూన్యతంద్రం దిశన్తీ
తుండీరాఖ్యే మహతి విషయే స్వర్ణవృష్టిప్రదాత్రీ
చండీదేవీ కలయతి రతిం చంద్రచూడాలచూలీ॥

అ॥ ప్రకృతి కుటిలమ్ - సహజవక్రమయిన, కల్మషమ్ - పాపమును, ఖండీకృత్య - ఖండించి, నిజ - తనయొక్క, పదజుషామ్ - పాదముల సేవించువారికి, శూన్యతంద్రం - ఏమరుపాటులేకుండగా, ప్రాతిభశ్రీ - ప్రతిభాసంపదతో, శుండీరత్వమ్ - శౌర్యమును, దిశన్తీ - ఇచ్చుచున్నదియై, తుండీరాఖ్యే - తుండీరమనుపేరుగల, మహతి విషయే - గొప్ప ప్రదేశమందు, స్వర్ణ వృష్టి - బంగారు వర్షమును, ప్రదాత్రీ - ఇచ్చునట్టి, చంద్ర చూడాల - చంద్రుడు శిరోభూషణమైన, చూలీ - కేశపాశముగల, చండీదేవీ - చండీదేవి, రతిం కలయతి - (మా విషయమై) ఆసక్తిని కలిగియున్నది.

75. యేన ఖ్యాతో భవతి సగృహీ పూరుషో మేరుధన్వా
యద్దృక్కోణే మదననిగమ ప్రాభవం బోభవీతి।
యత్ప్రీత్యైవ త్రిజగదధిపో జృంభతే కింపచానః
కంపాతీరే స జయతి మహాన్ కశ్చి దోజోవిశేషః॥

అ॥ మేరుధన్వా - మేరువు ధనుస్సుగాగల, సః పూరుషః - ఆ మహాపురుషుడు, ఖ్యాతః - ప్రసిద్ధుడయిన, గృహీభవతి - గృహస్థుడగునో!, యద్దృక్కోణే - ఎవతె చూపుకొనయందు, మదన నిగమ - కామశాస్త్రము యొక్క, ప్రాభవమ్ - ప్రభుత్వము, బోభవీతి - ఎక్కువగుచున్నదో!, యత్ - ఎవతె యొక్క, ప్రీత్యైవ - ప్రీతితోనే, కింపచానః - దరిద్రుడు, త్రిజగదధిపః - ముల్లోకములకధిపతిగా, జృంభతే - విజృంభించునో!, సః - అటువంటి, కశ్చిత్ - ఒకానొక, మహాన్ - గొప్ప, ఓజోవిశేషః - విశిష్టమైన తేజస్సు, కంపాతీరే - కంపానదీతీరమున, జయతి - విలసిల్లుచున్నది.

76. ధన్యా ధన్యా గతిరిహ గిరాం దేవి కామాక్షి కా మే
నింద్యాం భింద్యా త్సపది జడతాం కల్మషా దున్మిషన్తీ।
సాధ్వీ మాధ్వీరస మధురతాభంజినీ మంజురీతిః
వాణీ వేణీ ఝటితి వృణుతాత్ స్వర్ధునీ స్పర్ధినీ మామ్॥

అ॥ దేవి కామాక్షి - ఓ కామాక్షీ దేవీ, ఇహ - ప్రస్తుతము, కా - (కాచిత్) ఒకానొక, మే - నా యొక్క, ధన్యా ధన్యా - మిక్కిలి ధన్యమైన, గిరాంగతిః - వాక్కుల గతి, కల్మషాత్ - కలుషము నుండి, ఉన్మిషన్తీ - బయలువడినదియై, నింద్యామ్ - నిందనీయమయిన, జడతామ్ - జాడ్యమును, సపది - వెంటనే, భింద్యాత్ - భేదించును గాత!, మాధ్వీరస - మధుర రసము యొక్క, మధురతా - మాధుర్యమును, భంజినీ - భగ్నము చేయునట్టియు, సాధ్వీ - సాఫీయైనదియు, స్వర్ధునీ - ఆకాశగంగతో, స్పర్ధినీ - పోటీపడునట్టియు, వాణీ వేణీ - సరస్వతికేశపాశమనదగిన, మంజురీతిః - మనోహరమగు శైలి, మామ్ - నన్ను ఝటితి - వెంటనే, వృణుతాత్ - వరించుగాత!.

77. యస్యా వాటీ హృదయకమలం కౌసుమీ యోగభాజామ్
యస్యాః పీఠీ సతతశిశిరా శీకరై ర్మాకరందైః।
యస్యాః పేటీ శ్రుతిపరిచల న్మౌళిరత్నస్య కాంచీ
సా మే సోమాభరణమహిషీ సాధయే త్కాంక్షితాని॥

అ॥ యోగభాజామ్ - యోగులయొక్క, హృదయకమలమ్ - హృదయకమలము, యస్యాః - ఎవతెకు, కౌసుమీ - పుష్పములకు సంబంధించిన, వాటీ - ఉద్యానమో!, యస్యాః - ఎవతె యొక్క, పీఠీ - పీఠము (సహస్రారము), మాకరందైః - తేనెకు సంబంధించిన, శీకరైః - తుంపరలతో, సతతశిశిరా - ఎల్లపుడు చల్లనైనదో!, శ్రుతిపరిచలత్ - వేదములపై చరించు, మౌళి రత్నస్య - శిరోరత్నమయిన, యస్యాః - ఎవతెకు, కాంచీ - కంచి, పేటీ - పేటిక యగునో!, సోమాభరణ - చంద్రుడాభరణముగాగల, మహిషీ - పట్టమహిషియగు కామాక్షి, మే - నా యొక్క, కాంక్షితాని - కోరికలను, సాధయేత్ - సాధించు గాక!

78. ఏకా మాతా సకలజగతా మేయుషీ ధ్యానముద్రా
మేకామ్రాధీశ్వరచరణయో రేకతానా సమిన్ధే।
తాటంకోద్య న్మణిగణరుచా తామ్రకర్ణప్రదేశా
తారుణ్యశ్రీస్తబకితరుచా తాపసీ కాపి బాలా॥

అ॥ తాటంక - చెవుల ఆభరణముల, ఉద్యత్ - అతిశయించిన, మణిగణ - మణిసముదాయము యొక్క, రుచా - కాంతితో, తామ్ర - ఎఱ్ఱబడిన, కర్ణప్రదేశా - చెవుల ప్రాంతము కలిగి నట్టియు, తారుణ్యశ్రీ - యౌవనశోభతో, స్తబకిత - పుంజీభూతమైన, రుచా - కాంతి గలిగిన, తాపసీ - తపస్విని యైన, కాపి - ఒకానొక, బాలా - నవయువతి (కామాక్షి), సకల జగతామ్ - సమస్త జగత్తులకు, ఏకామాతా - ఒకే ఒక తల్లియై, ధ్యానముద్రామ్ - ధ్యానముద్రను, ఏయుషీ - పొందినదియై, ఏకామ్రాధీశ్వర - ఏకామ్రనాథుని, చరణయోః - పాదములందు, ఏకతానా - ఏకాగ్రత కలదిగా, సమిన్ధే - ప్రకాశించుచున్నది.

79. దన్తాదన్తిప్రకటనకరీ దన్తిభి ర్మన్దయానైః
మన్దారాణాం మదపరిణతిం మథ్నతీ మన్దహాసైః।
అంకూరాభ్యాం మనసిజతరో రంకితోరాః కుచాభ్యా
మంతః కాంచి స్ఫురతి జగతా మాదిమా కాపి మాతా॥

అ॥ మన్దయానైః - మెల్లనినడకలతో, దన్తిభిః - ఏనుగులతో, దన్తాదన్తి - పోటీని, ప్రకటనకరీ - ప్రకటింప జేయుచున్నదై (సవాలు చేయుచు), మన్దహాసైః - చిరునవ్వులతో, మన్దారాణామ్ - మందారపుష్పముల, మదపరిణతిమ్ - మదపరిపాకమును, మథ్నతీ - మథించునదియై, మనసిజతరోః - మన్మథుడను వృక్షమునకు, అంకూరాభ్యామ్ - అంకురములయిన, కుచాభ్యామ్ - స్తనములతో, అంకితోరాః - ముద్రిత మైన వక్షస్సుగలదై, జగతామ్ - జగత్తులకు, ఆదిమా - మూలమయిన, కాపి - ఒకానొక, మాతా - తల్లి (జగన్మాత), అంతఃకాంచి - కాంచీనగర మధ్యమందు, స్ఫురతి - ప్రకాశించుచున్నది.

80. త్రియంబకకుటుమ్బినీం త్రిపురసున్దరీ మిన్దిరాం
పులిందపతిసుందరీం త్రిపురభైరవీం భారతీమ్।
మతంగకుల నాయికాం మహిషమర్దినీం మాతృకామ్
భణన్తి విబుధోత్తమా విహృతిమేవ కామాక్షి తే॥

అ॥ హే కామాక్షి - ఓ కామాక్షి, తే - నీ యొక్క, విహృతిమేవ - విహారమునే, విబుధోత్తమాః - పండితోత్తములు, త్రియంబక కుటుంబినీమ్ - శివుని పత్నినిగాను, త్రిపురసున్దరీమ్ - త్రిపుర సుందరినిగాను, ఇన్దిరామ్ - లక్ష్మినిగాను, పుళిందపతి సుందరీమ్ - వేటగాని యిల్లాలుగాను, త్రిపుర భైరవీమ్ - త్రిపురభైరవిగాను, భారతీమ్ - సరస్వతీ నిగాను, మతంగకులనాయికామ్ - మాతంగినిగాను, మహిషమర్దినీమ్ - మహిషాసుర మర్దినిగాను, మాతృకామ్ - మాతృకావర్ణమాల గాను, భణన్తి - చెప్పుచున్నారు.

81. మహామునిమనోనటీ మహితరమ్య కమ్పాతటీ
కుటీరకవిహారిణీ కుటిలబోధసంహారిణీ।
సదా భవతు కామినీ సకలదేహినాం స్వామినీ
కృపాతిశయకింకరీ మమ విభూతయే శాంకరీ॥

అ॥మహాముని - మహామునులయొక్క, మనోనటీ - మనస్సులందు నటించునదియు, మహిత - పూజనీయమయిన, రమ్య - అందమయిన, కంపాతటీ - కంపానది తటమందలి, కుటీరక - కుటీరమందు, విహారిణీ - విహరించునదియు, కుటిలబోధ - వక్రజ్ఞానమును (భ్రాంతిని), సంహారిణీ - సంహరించునదియు, సకలదేహినాం - సమస్తప్రాణులకు, స్వామినీ - నాయకురాలు అయినట్టియు, కృపాతిశయ - అధికమైన దయచేత (భక్తులకు), కింకరీ - సేవకురాలయిన, శాంకరీ - శివుని, కామినీ - ప్రియురాలు (కామాక్షి), మమ - నా యొక్క, విభూతయే - సంపత్తికొఱకు, సదా - ఎల్లపుడు, భవతు - అగుగాక!

82. జడాః ప్రకృతినిర్ధనా జనవిలోచనారున్తుదాః
నరా జనని వీక్షణాం క్షణ మవాప్య కామాక్షి తే।
వచస్సు మధుమాధురీం ప్రకటయన్తి పౌరన్దరీ
విభూతిషు విడమ్బనాం వపుషి మాన్మథీం ప్రక్రియామ్॥

అ॥ జననీ కామాక్షి - తల్లీ కామాక్షీ, జడాః - మూఢులయినట్టియు, ప్రకృతినిర్ధనాః - సహజముగా దరిద్రులయినట్టియు, జనవిలోచన - లోకులకన్నులకు, అరుంతుదాః - మంటబుట్టించు నట్టియు, నారః - మనుష్యులు, తే - నీ యొక్క, వీక్షణమ్ - చూపును, క్షణమ్ - క్షణకాలము, అవాప్య - పొంది, వచస్సు - పలుకులందు, మధుమాధురీమ్ - తేనె తీయదనమును, ప్రకటయన్తి - ప్రకటము చేయుదురు, పౌరందరీ విభూతిషు - ఇంద్రసంపదలందు, విడంబనామ్ - అనుకరణమును, ప్రకటయన్తి - ప్రకటముచేయుదురు (అనగా ఇంద్ర సంపత్తిని కూడ కృత్రిమము చేయగల సంపదనందెదరు), వపుషి - దేహమునందు, మాన్మథీం ప్రక్రియామ్ - మన్మథుని విధానమును (మన్మథుని చందమును), ప్రకటయన్తి - ప్రకటముచేయుదురు.

83. ఘనస్తనతట స్ఫుటస్ఫురిత కంచులీ చంచలీ
కృత త్రిపురశాసనా సుజనశీలితోపాసనా।
దృశో స్సరణి మశ్నుతే మమ కదాను కాంచీపురే
పరా పరమయోగినాం మనసి చిత్కలా పుష్కలా॥

అ॥ ఘనస్తనతట - నిబిడమైన స్తనతటముచే, స్ఫుటస్ఫురిత - స్పష్టముగా స్ఫురితమైన, కంచులీ - కంచుకముచే (రవికతో), చంచలీకృత - చంచలముచేయబడిన, త్రిపురశాసనా - త్రిపురారి యగు శంకరుడు కల్గినట్టియు, సుజనా - సత్పురుషులచే, శీలిత - పరిశీలింపబడిన, ఉపాసనా - ఉపాసన కలిగినట్టియు, పరమయోగినామ్ - మహాయోగులయొక్క, మనసి - మనస్సునందు, పుష్కలా - పుష్కలమైన, చిత్కళా - చిత్కళయగు, పరా - పరాదేవత, కాంచీపురే - కాంచీ పట్టణమందు, మమ - నా యొక్క, దృశోః - చూపుల, సరణిమ్ - మార్గమును, కదా - ఎన్నడు, అశ్నుతేను - పొందునో!

84. కవీంద్రహృదయేచరీ పరిగృహీతకాంచీపురీ
నిరూఢకరుణాఝరీ నిఖిలలోకరక్షాకరీ।
మనఃపథదవీయసీ మదనశాసనప్రేయసీ
మహాగుణగరీయసీ మమ దృశో2స్తు నేదీయసీ॥

అ॥ కవీంద్ర - కవిశ్రేష్ఠుల యొక్క, హృదయేచరీ - హృదయమందు సంచరించునదియు, పరిగృహీత - స్వీకరించబడిన, కాంచీపురీ - కాంచీపురముగలట్టియు, నిరూఢ - దృఢమయిన, కరుణాఝరీ - దయాప్రవాహము గల్గినట్టియు, నిఖిలలోక - సమస్త లోకములకు, రక్షాకరీ - రక్షణముచేయునట్టియు, మనఃపథ - మనో మార్గమునకు దూరమయినట్టియు, మహాగుణ - గొప్పగుణములతో, గరీయసీ - గరిష్ఠురాలయి, మదన శాసన - మన్మథుని శిక్షించిన శివునకు, ప్రేయసీ - ప్రియురాలయిన కామాక్షి, మమ - నా యొక్క, దృశః తు - చూపుకు మాత్రము, నేదీయసీ - దరిదాపు, అస్తు - అగుగాక.

85. ధనేన న రమామహే ఖలజనా న్న సేవామహే
న చాపల మయామహే భవభయా న్న దూయామహే।
స్థిరాం తనుమహేతరాం మనసి కించ కాంచీరత
స్మరాంతకకుటుంబినీ చరణపల్లవోపాసనామ్॥

అ॥ (మేము) ధనేన - ధనముతో, న రమామహే - క్రీడించుటలేదు, ఖలజనాన్ - నీచులను, న సేవామహే - సేవించుటలేదు, చాపలమ్ - చపలత్వమును, న అయామహే - పొందుటలేదు, కించ - మఱియు, భవభయాత్ - సంసారభీతి వలన, న దూయామహే - పరితపించుటలేదు, మనసి - మనస్సునందు, కాంచీరత - కాంచీపురమందాసక్తిగల స్మరాంతక - మదనునిదహించిన శివుని, కుటుంబినీ - పత్నియగు కామాక్షి యొక్క, చరణపల్లవ - చిగురుటాకులబోలు పాదముల, ఉపాసనామ్ - ఉపాసనను, స్థిరామ్ - స్థిరముగా, తనుమహేతరామ్ - చక్కగా చేయుచున్నాము.

86. సురాః పరిజనా వపుః మనసిజాయ వైరాయతే
త్రివిష్టపనితంబినీకుచతటీ చ కేళీగిరిః।
గిర స్సురభయో వయ స్తరుణిమా దరిద్రస్య వా
కటాక్షసరణౌ క్షణం నిపతితస్య కామాక్షి తే॥

అ॥ కామాక్షి - ఓ కామాక్షీ, తే - నీ యొక్క, కటాక్ష సరణౌ - క్రీగంటి చూపు మార్గమందు, క్షణం - క్షణకాలము, నిపతితస్య - పడినటువంటి, దరిద్రస్యవా - దరిద్రుడయిన వానికి గాని, సురాః - దేవతలు, పరిజనాః - పరిజనులు (అగుదురు), వపుః - దేహము, మనసిజాయ - మన్మథుని కొఱకు, వైరాయతే - వైరము చేయును, త్రివిష్టప - స్వర్గములోని, నితంబినీ - స్త్రీ యొక్క (అప్సర యొక్క), కుచతటీ చ - స్తనతటమును, కేళీగిరిః - విహారము సల్పుకొండ (యగును), గిరః - వాక్కులు, సురభయః - కామధేనువులు (అగును), వయః - వయస్సు, తరుణిమా - యౌవనము అగును.

87. పవిత్రయ జగత్త్రయీ విబుధబోధజీవాతుభిః
పురత్రయవిమర్దినః పులకకంచులీదాయిభిః।
భవక్షయవిచక్షణైః వ్యసనమోక్షణై ర్వీక్షణైః
నిరక్షరశిరోమణిం కరుణయైవ కామాక్షి మామ్॥

అ॥ కామాక్షి - ఓ కామాక్షీ, మామ్ - నన్ను, జగత్త్రయ - ముల్లోకములోని, విబుధ - పండితుల, బోధ - తెలివికి, జీవాతుభిః - జీవనౌషధములయినట్టియు, పురత్రయ - మూడుపురములను, విమర్దినః - మర్దించు శంకరునకు, పులక - గగుర్పాటు అను, కంచులీ - కంచుకమును, దాయిభిః - ఇచ్చునట్టియు, వ్యసన - దుఃఖములను, మోక్షణైః - పోగొట్టునట్టియు, వీక్షణైః - చూపులతో, నిరక్షర - అక్షరజ్ఞానములేని మూర్ఖులలో, శిరోమణిమ్ - అగ్రేసరుడనయిన, మామ్ - నన్ను, కరుణయైవ - కరుణతోనే, పవిత్రయ - పవిత్రునిచేయుము.

88. కదా కలితఖేలనాః కరుణయైవ కాంచీపురే
కలాయముకులత్విషః శుభకదంబపూర్వాంకురాః।
పయోధరభరాలసాః కవిజనేషు తే బంధురాః
పచేలిమకృపారసాః పరిపతన్తి మార్గే దృశోః॥

అ॥ కరుణయైవ - దయచేతనే, కాంచీపురే - కాంచీపత్తన మందు, కలితఖేలనాః - సముచితమైన విహారములు కల్గినట్టియు, కలాయముకుల - ఇరుగుడు పువ్వుల, త్విషః - కాంతులు గలిగినట్టియు, శుభకదంబ - మంగళముల సముదాయమునకు, పూర్వాంకురాః - ముందున్న అంకురములైనట్టియు, పయోధరభర - స్తనముల భారముచే, అలసాః - అలసత కలిగినట్టియు (కొంచెం వంగిన), కవిజనేషు - కవిజనములందు, బంధురాః - స్నేహశీలములయినట్టియు, తే - నీ యొక్క, పచేలిమ - బాగుగా పరిపక్వమయిన, కృపారసాః - దయారసములు, దృశోః - చూపులయొక్క, మార్గే - మార్గమందు, కదా - ఎన్నడు, పరిపతన్తి - పడును?

భవక్షయ = సంసారక్షయము నందు ; విచక్షణైః - పాండిత్యము గలిగినట్టియు

89. అశోధ్య మచలోద్భవం హృదయనన్దనం దేహినా
మనర్ఘ మధికాంచి తత్కిమపి రత్న ముద్యోతతే।
అనేన సమలంకృతా జయతి శంకరాంకస్థలీ
కదాఽస్య మమ మానసం వ్రజతి పేటికావిభ్రమమ్॥

అ॥ అశోధ్యమ్ - శోధనముచేయనవసరములేనట్టియు, అచలోద్భవమ్ - పర్వతమున బుట్టినట్టియు, దేహినామ్ - ప్రాణులకు, హృదయనన్దనమ్ - హృదయాహ్లాదకరమైనట్టియు, అనర్ఘమ్ - అమూల్యమయినట్టియు, తత్ - ఆ, కిమపి - ఒకానొక, రత్నమ్ - రత్నము (కామాక్షి), ఉద్యోతతే - ప్రకాశించుచున్నది. అనేన - దీనిచేత, సమలంకృతా - అలంకృతమై, శంకరాంకస్థలీ - శంకరుని ఒడి, జయతి - సర్వోత్కర్షతోనున్నది, అస్య - ఈ రత్నమునకు, మమ - నా యొక్క, మానసమ్ - మనస్సు, కదా - ఎప్పుడు, పేటికావిభ్రమమ్ - పెట్టె కాదగు విలాసమును, వ్రజతి - పొందును?

90. పరామృతఝరీప్లుతా జగతి నిత్యమంతశ్చరీ
నృణామసి బహిశ్చరీ పరమసంవిదేకాత్మికా।
మహద్భి రపరోక్షితా సతతమేవ కాంచీపురే
మమాన్వహ మహంమతి ర్మనసి భాతు మాహేశ్వరీ॥

అ॥ పరామృత - పరాత్మ అను అమృతము యొక్క, ఝరీ - ప్రవాహముతో, ప్లుతా - తేలియాడునట్టియు, జగతి - జగత్తున, నృణామ్ - మానవులకు, నిత్యమ్ - ఎల్లకాలము, అంతశ్చరీ - అంతరంగమున చరించునట్టియు, బహిశ్చరీ అపి - బహిరంగమున కూడ చరించునట్టియు, పరమ సంవిదేకాత్మికా - పరమజ్ఞానముతో ఏకరూపమయినట్టియు, సతత మేవ - ఎల్లప్పుడుగానే, కాంచీపురే - కాంచీపత్తనమందు, మహద్భిః - గొప్పవారిచే, అపరోక్షితా - ప్రత్యక్షము చేసికొనబడినట్టియు, మాహేశ్వరీ - కామాక్షి, మమ - నాకు, అన్వహమ్ - ప్రతిదినము, మనసి - మనస్సునందు, అహంమతిః - నేను అనుమనోవృత్తిగా, భాతు - ప్రకాశించుగాత!

91. తమోవిపినధావినం సతతమేవ కాంచీపురే
విహారరసికా పరా పరమ సంవిదుర్వీరుహే।
కటాక్ష నిగలైర్దృఢం హృదయదుష్టదన్తావలమ్
చిరం నయతు మామకం త్రిపురవైరిసీమన్తినీ॥

అ॥ సతతమేవ - ఎల్లపుడు, కాంచీపురే - కాంచీనగరమందు, విహారరసికా - విహరించుటయందాసక్తి గల, త్రిపురవైరిసీమన్తినీ - శివుని పత్నియగు, పరా - పరదేవత, తమోవిపిన - అజ్ఞానమను అరణ్యమున, ధావినమ్ - పరుగెత్తునట్టి, మామకమ్ - నాదయిన, హృదయ - హృదయమను, దుష్టదన్తావలమ్ - ఏనుగును, కటాక్షనిగళైః - క్రీగంటి చూపులను సంకెళ్లతో, పరమసంవిత్ - పరమాత్మజ్ఞానమను, ఉర్వీరుహే - చెట్టువద్దకు, దృఢమ్ - గట్టిగా, చిరమ్ - శాశ్వతముగా, నయతు - తీసికొనిపోవుగాక!

92. త్వమేవ సతి చండికా త్వమిహ దేవి చాముండికా
త్వమేవ పరమాతృకా త్వమసి యోగినీ రూపిణీ।
త్వమేవ కిల శాంభవీ త్వమసి కామకోటీ జయా
త్వమేవ విజయా త్వయి త్రిజగదంబ కిం బ్రూమహే॥

అ॥ త్రిజగదంబ - ముల్లోకములకు తల్లియయిన కామాక్షీ!, హేసతి - ఓసతీ, హేదేవి - ఓ దేవీ, త్వమేవ - నీవే, చండికా(అసి) - చండికవు, ఇహ - ఇచట, త్వమ్ - నీవు, చాముండికా - చాముండవు, త్వమేవ -నీవే, పరమాతృకా - పరమాతృకవు, త్వమ్ - నీవు, యోగినీ రూపిణీ - యోగినీ రూపిణివి, అసి - అయిఉన్నావు, త్వమేవ - నీవే, శాంభవీకిల - శాంభవివి కదా!, త్వమ్ - నీవు, కామకోటీ అసి - కామకోటివి అయి ఉన్నావు, త్వమేవ - నీవే, జయా - జయవు, త్వమేవ - నీవే, విజయా - విజయవు, త్వయి - నీ విషయమై, కిం బ్రూమహే - ఏమి చెప్పుదుము?

93. పరే జనని పార్వతి ప్రణతపాలిని ప్రాతిభ
ప్రదాత్రి పరమేశ్వరి త్రిజగదాశ్రితే శాశ్వతే।
త్రియంబకకుటుంబిని త్రిపదసంగిని త్రీక్షణే
త్రిశక్తిమయి వీక్షణం మయి నిధేహి కామాక్షి తే॥

అ॥ పరే - ఓ పరదేవతా, జనని - ఓ తల్లీ, పార్వతి - ఓ పార్వతి, ప్రణతపాలిని - నతులగువారిని పాలించుదాన, ప్రాతిభ - ప్రతిభామూలకమగు కవిత్వమును, ప్రదాత్రి - ఇచ్చుదానా, పరమేశ్వరి - ఓ పరమేశ్వరీ, త్రిజగదాశ్రితే - ముల్లోకవాసులచే ఆశ్రయింపబడినదానా, శాశ్వతే - శాశ్వతమయినదానా, త్రియంబక - శివుని, కుటుంబిని - సతీమణీ, త్రిపదసంగిని - మూడు స్థానములతో సంగముగలదానా, త్రీక్షణే - మూడు కన్నులు కలదానా, త్రిశక్తిమయి - ఇచ్ఛా శక్తి జ్ఞాన శక్తి క్రియాశక్తి రూపిణీ, కామాక్షి - ఓ కామాక్షి, తే - నీ యొక్క, వీక్షణమ్ - చూపును, మయి - నా యందు, నిధేహి - ఉంచుము.

94. మనోమధుకరోత్సవం విదధతీ మనీషాజుషామ్
స్వయంప్రభవవైఖరీ విపినవేదికాలంబినీ।
సదాశిశిరితా కృపామధురసేన కమ్పాతటే
చరాచరవిధాయినీ చరతి కాపి చిన్మంజరీ॥

అ॥ మనీషాజుషామ్ - బుద్ధిమంతులయిన వారికి, మనో మధుకర - మనస్సను తుమ్మెదకు, ఉత్సవమ్ - పండుగను, విదధతీ - చేయుచున్నట్టియు, స్వయంప్రభవ - స్వయముగా నావిర్భవించిన, వైఖరీ - వైఖరి వాక్కను, వేదికా - వేదికను, ఆలంబినీ - అవలంబించు నట్టియు, కృపామధురసేన - దయాగుణమను మధురసముతో, సదాశిశిరితా - ఎల్లపుడు చల్లగా నుండునట్టియు, చరాచర - జంగమస్థావరాత్మక సృష్టిని, విధాయినీ - చేయునట్టి, కాపి - ఒకానొక, చిన్మంజరీ -జ్ఞప్తిమొత్తముల గుత్తియగు కామాక్షి, కంపాతటే - కంపానదీ తీరమున, చరతి - విహరించు చున్నది.

95. కలావతి కలాభృతో ముకుటసీమ్ని లీలావతి
స్పృహావతి మహేశ్వరే భువనమోహనే భాస్వతి।
ప్రభావతి రమే సదా మహితరూపశోభావతి
త్వరావతి పరే సతాం గురుకృపామ్బుధారావతి॥

అ॥ కలాభృతః - చంద్రునియొక్క, కళావతి - కళ కలిగినట్టి, ముకుటసీమ్ని - కిరీటప్రదేశమున, లీలావతి - క్రీడగలిగినట్టియు, భాస్వతి - ప్రకాశవంతమయినట్టియు, భువన మోహనే - లోకములను మోహింపజేయు, మహేశ్వరే - శివునియందు, స్పృహావతి - ఆశగల్గినట్టియు, ప్రభావతి - కాంతి కలిగినట్టియు, మహిత - మహనీయమయిన, రూప - ఆకారము యొక్క, శోభావతి - శోభ కలిగినట్టియు, త్వరావతి - తొందర కలిగినట్టియు (భక్తుల బ్రోచుటలో), గురుకృపా - గొప్ప దయయును, అంబు (గురుదేవుని దయయను), అంబుధారావతి - జలధార గలిగిన, పరే - పరమవస్తువగు, త్వయి - నీయందు (అహంకారము), సదా - ఎల్లపుడు, రమే - నేను రమించుచున్నాను.

96. త్వయైవ జగదంబయా భువనమండలం సూయతే
త్వయైవ కరుణార్ద్రయా తదపి రక్షణం నీయతే।
త్వయైవ ఖరకోపయా నయనపావకే హూయతే
త్వయైవ కిల నిత్యయా జగతి సన్తతం స్థీయతే॥

అ॥ హే కామాక్షి - ఓ కామాక్షి, జగదంబయా - జగత్తునకు తల్లివయిన, త్వయైవ - నీ చేతనే, భువనమండలమ్ - బ్రహ్మాండముల సముదాయము, సూయతే - ప్రసవింపబడు చున్నది, కరుణార్ద్రయా - దయతో సిక్తమైన, త్వయైవ - నీ చేతనే, తదపి - ఆభువనమండలము, రక్షణం నీయతే - రక్షణము పొందింపబడుచున్నది, ఖరకోపయా - తీక్షణ కోపముగల, త్వయైవ - నీచేతనే, నయనపావకే - కంటిమంట యందు, హూయతే - హవనముచేయబడుచున్నది, నిత్యయా - శాశ్వత మయిన, త్వయైవ - నీచేతనే, జగతి - ప్రపంచమున, సన్తతమ్ - ఎల్లపుడు, స్థీయతేకిల - ఉండబడుచున్నది కదా!

97. చరాచరవిచిన్మయీం సకలహృన్మయీం చిన్మయీమ్
గుణత్రయమయీం జగత్త్రయమయీం త్రిధామామయీమ్।
పరాపరమయీం సదా దశదిశా నిశాహర్మయీమ్
పరాం సతతసన్మయీం పరమచిన్మయీం శీలయే॥

అ॥ చరాచర - జంగమ స్థావరాత్మ సృష్టిలో, విచిన్మయీమ్ - విలక్షణమైన చిద్రూపిణి అయినట్టియు, సకలహృన్మయీమ్ - అందరి హృదయాల రూపమయినట్టియు, చిన్మయీమ్ - చిద్రూపిణి అయినట్టియు, గుణత్రయమయీమ్ - త్రిగుణస్వరూపురాలయినట్టియు, జగత్త్రయమయీమ్ - ముల్లోకముల రూపముగా నున్నట్టియు, త్రిధామామయీమ్ - మూడు స్థానములుగా నున్నట్టియు, పరాపరమయీమ్ - పరాపరస్వరూపురాలయినట్టియు, దశదిశానిశాహర్మయీమ్ - దశదిక్కులు, రాత్రింబగళ్లుగా నున్నట్టియు, సతతసన్మయీమ్ - ఎల్లపుడు సద్రూపముగా నున్నట్టియు, పరమచిన్మయీమ్ - మిక్కిలి చిద్రూపముగా నున్నట్టియు, పరామ్ - పరదేవతను (కామాక్షిని), శీలయే - ధ్యానించుచున్నాను.

98. జయజగదమ్బికే హరకుటుమ్బిని నేత్రరుచా
జితశరదమ్బుజే ఘనవిడమ్బిని కేశరుచా।
పర మవలమ్బనం కురు సదా పరరూపధరే
మమ గతసంవిదో జడిమడమ్బరతాండవినః॥

అ॥ జగదమ్బికే - ఓ జగదంబా, జయ - జయముచేయుము, హరకుటుంబిని - ఓ శివుని యిల్లాలా, నేత్రరుచా - కన్నులకాంతిలో, జితశరదమ్బుజే - గెల్వబడిన శరత్కాల కమలములుగలదానా!, కేశరుచా - కేశకాంతితో, ఘనవిడంబిని - మేఘములననుకరించుదానా, పరరూపధరే - పరమమైన ఆకృతిని ధరించినదానా, గతసంవిదః - పోయిన జ్ఞానముకల, జడిమడంబర - జాడ్యము యొక్క ఆడంబరముతో, తాండవినః - తాండవము చేయు, మమ - నాకు, సదా - ఎల్లపుడు, పరమ్ - గొప్ప, అవలంబనం కురు - ఆలంబనము చేయుము.

99. భువనజనని భూషాభూతచంద్రే నమస్తే
కలుషశమని కంపాతీరగేహే నమస్తే।
నిఖిలనిగమవేద్యే నిత్యరూపే నమస్తే
పరశివమయి పాశచ్ఛేదహస్తే నమస్తే॥

అ॥ భువనజనని - ఓ లోకమాతా, భూషాభూత - అలంకారమయిన, చంద్రే - చంద్రుడుగలదానా!, తే నమః - నీకు నమస్కారము, కలుషశమని - పాపమును శమింపజేయుదానా, కంపాతీరగేహే - కంపానదీతటమునివాసముగలదానా, తే - నీకు, నమః - నమస్కారము, నిఖిల - సమస్తమైన, నిగమ - వేదములకు, వేద్యే - తెలియదగినదానా, నిత్యరూపే - శాశ్వతరూపముగలదానా, తే - నీకు, నమః - నమస్కారము, పరశివమయి - పరశివస్వరూపురాలా, పాశచ్ఛేదహస్తే - పాశమును (సంసారబంధమును) ఛేదించు చేతులుగలదానా!, తే నమః - నీకు నమస్కారము.

100. క్వణత్కాంచీ కాంచీపురమణివిపంచీలయఝురీ
శిరఃకంపా కంపావసతి రనుకంపాజలనిధిః।
ఘనశ్యామా శ్యామా కఠినకుచసీమా మనసి మే
మృగాక్షీ కామాక్షీ హరనటనసాక్షీ విహరతామ్॥

అ॥ క్వణత్కాంచీ - మ్రోయుచున్న వడ్డాణము కింకిణులు గలట్టియు, కాంచీపుర - కంచియను, మణివిపంచీ - రత్నవీణపలుకు, లయఝురీ - స్వరప్రవాహమునకు, శిరఃకమ్పా - తలనాడించునట్టియు, అనుకంపాజలనిధిః - దయాసాగరమైనట్టియు, ఘనశ్యామా - మేఘమువలె శ్యామలమైనట్టియు, శ్యామా - యౌవనమధ్యస్థయైనట్టియు, కఠినకుచసీమా - కఠినమైన స్తన ప్రదేశము గలట్టియు, మృగాక్షీ - జింక కన్నుల వంటి కన్నులు గలట్టియు, హరనటనసాక్షీ - శివుని విలయతాండవమునకు సాక్షి అయిన, కామాక్షీ - కామాక్షి, మే - నా యొక్క, మనసి - మనసునందు, విహరతామ్ - విహరించుగాక!

101. సమరవిజయకోటీ సాధకానన్దధాటీ
మృదు గుణగణ మణీపేటీ ముఖ్యకాదమ్బవాటీ।
మునినుతపరిపాటీ మోహితాజాండకోటీ
పరమశివవధూటీ పాతు మాం కామకోటీ॥

అ॥ సమరవిజయకోటీ - యుద్ధవిజయపు పరాకాష్ఠ అయినట్టియు, సాధక - సాధకుల యొక్క, ఆనన్దధాటీ - ఆనందోద్రేకరూపమయినట్టియు, మృదు - సుకుమారమైన, గుణగణమణీపేటీ - అనేక గుణముల బండారమయినట్టియు, ముఖ్య - ప్రధానమైన, కాదంబవాటీ - కదంబ వనము కలిగినట్టియు, ముని - మునులచేత, నుత - స్తోత్రముచేయబడిన, పరిపాటీ - అనుక్రమము కలిగినట్టియు, మోహిత - మోహింపజేయబడిన, అజాండకోటీ - బ్రహ్మాండకోటులు గలిగినట్టియు, పరమశివవధూటీ - పరమశివుని పత్నియగు, కామకోటీ - కామకోటి (కామాక్షి), మాం పాతు - నన్ను కాపాడు గాక!

102. ఇమాం పరవరప్రదాం ప్రకృతిపేశలాం పావనీం
పరాపరచిదాకృతి ప్రకటన ప్రదీపాయితామ్।
స్తుతిం పఠతి నిత్యదా మనసి భావయ న్నంబికాం
జపై రలమలం మఖై రధికదేహసంశోషణైః॥

అ॥ జనః - నరుడు (అధ్యాహారము), పరవరప్రదామ్ - ఉత్తమ మగు వరములనిచ్చునట్టియు, ప్రకృతిపేశలాం - సహజసుకుమారమయినట్టియు, పావనీమ్ - పవిత్రముచేయునట్టియు, పరాపర - పరము అపరము లయిన, చిదాకృతి - చిదాకారమును, ప్రకటన - ప్రకాశముచేయుటకు, ప్రదీపాయితామ్ - దీపమయినట్టియు, ఇమాం స్తుతిమ్ - ఈస్తుతిని, మనసి - మనసునందు, అంబికామ్ - కామాక్షి అమ్మవారిని, భావయన్ - భావించుచు, నిత్యదా - ఎల్లపుడు, పఠతి - చదువునో (తస్య - అతనికి), అధికదేహ సంశోషణైః - ఎక్కువగా శరీరమును కృశింపజేయు, జపైః అలమ్ - జపములు వద్దు, మఖైఃఅలమ్ - యాగములు వద్దు.

53

## మూక పంచశతి

మూలము : మూక మహాకవి

పాదారవింద శతకము రు. 10-00

అర్ధ తాత్పర్యములు

శ్రీ యస్. పి. లోకాచార్యులు

కటాక్ష శతకము రు. 15-00

అర్థ-తాత్పర్య వివరణ

శ్రీ దోర్బల విశ్వనాథశర్మ

## జగన్మాత 'కటాక్షం'

"జగజ్జనని కరుణారుణకాంతులు దిగ్దిగంతాలను చైతన్యవంతం చేయగలిగినవి. బ్రహ్మాండనగర నాయిక అనుగ్రహ విశేషం వల్లనే ఒక మూగవ్యక్తి మహాకవి కాగలిగాడు. మూకపంచశతిని అందించి ప్రపంచ ప్రఖ్యాతిని బడసినాడు.... మూక మహాకవి రచనలు చదువుతున్నపుడు అమ్మవారి తర్వాత శంకర భగవత్పాదులవారు కళ్ళముందు సాక్షాత్కరిస్తారు... మూక మహాకవి సకలశాస్త్ర పారంగతుడు. జగన్మాత భక్తులందరు చదివి తీరవలసిన గ్రంథమిది. కొలది ప్రతులు మాత్రమే గలవు.

త్వరలో

## మందస్మిత శతకము

అర్ధ - తాత్పర్యవివరణలతో

---

సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201